# చైతన్య స్రవంతి

(స్త్రీ సమస్యలపై వ్యాస సంపుటి)

రచన

డా॥ వాసా ప్రభావతి ఎం.ఏ. పి.హెచ్.డి.

తెలుగు ఉపన్యాసకురాలు
సరోజినీ నాయుడు వనితా మహావిద్యాలయ
హైదరాబాదు

వాసా ప్రచురణలు
మలక్‌పేట, హైదరాబాదు.

చైతన్య స్రవంతి.
డా॥ వాసా ప్రభావతి.
ప్రధమ ముద్రణ : జనవరి 1991

వెల 15 / -

ముద్రణ.
స్నేహలతా ప్రింటర్స్,
పాటిగడ్డ కాలనీ, సికింద్రాబాదు.
ఫోన్ నెం : 847943

ప్రతులకు.
వి. వి. మాధవి.
వాసానిలయం,
మునిసిపల్ కాలనీ 11/2 RT
మలక్ పేట.
హైదరాబాదు, 500036.

నవయుగ బుక్ హౌస్.
సుల్తాన్‌బజార్, హైదరాబాదు'

---

ఈ పుస్తకం తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో ముద్రించ బడినది.

# అంకితం

అంతర్జాతీయ మహిళా దినోత్సవంలో మహిళల ప్రగతిని కోరుతూ అంతర్జాతీయ మహిళలకు అంకితం.

రచయిత్రి

# మనవి

ఈనాటి మహిళ, విద్యావతి, వివేకవతేకాదు సంపాదకురాలు కూడా అయినా మహిళ మరింత ఉన్నతస్థానం అలంకరించవలసి వుంది. చదువు-సంపాదనేకాదు - సాంఘిక - ఆర్థిక రాజకీయ రంగాలలో ముందంజ వేయడానికి మరింత కృషిచేయవలసి వుంది. స్త్రీ పురుషులకు భేదం లేనికాలం ఆసన్నమవుతోంది అయినా మరో పక్క ఆడవాళ్ళు ఆ ఔన్న త్యానికి అమడ దూరంలో వున్నారు అందుకే ఈనాటి స్త్రీ లోకాన్ని మూడు రకాలుగా చూడవచ్చు. 1) అక్షరజ్ఞానం లేనివారు 2) అక్షరజ్ఞానం ఉన్నా ఆర్థిక, సాంఘిక స్థితిలేనివారు 3) అన్నీ ఉండి సమస్యల వలయంలో ఉన్న వారు వీరుకాకుండా అన్నివిధాల బాగున్న సమాజంఉంది. వారికి ఆర్థిక ఇబ్బందులే లేవు. అయినా వారిని కూడా పరిశీలిస్తే వారుకూడా ఎన్నో విష యాలు నేర్చుకుని విజ్ఞానవంతులుగా, వివేకవంతులుగా. సామాజిక ఔన్నత్యానికి పాటుపడేవారుగా మారవలసిఉంది. విజ్ఞానవంతుల కోసం వివేకాన్ని మెరుగు పెట్టుకోడానికి ఎన్ని గ్రంథాలున్నాయి. పైన పేర్కొ బడిన స్త్రీలు రకరకాల సమస్యల వలయంలో చిక్కుకొని వున్నారు వారందరూ చదవవలసి తేలికైన భాషలో ఈ వ్యాసాలు రాయడం జరిగింది ఒకరు చదివి ఆనందించినా ఈ వ్యాససంపుటి జీవం పోసుకున్నట్లే. అలా చదివే వారికి నాకృతజ్ఞతలు ముందుగానే అందజేస్తున్నాను.

డా. వాసా ప్రభావతి

# "స్త్రీమూర్తి"

"మాతృ దేవోభవ" అని ఆర్యోక్తి. మనదేశంలో మాతృమూర్తిని దేవతగా పూజించమన్నారు. ఇంతకంటే స్త్రీకి గౌరవం మరెక్కడ వుంటుంది. స్త్రీ తన సంతానాన్ని, తన గృహాన్ని తీర్చి దిద్దుకున్నప్పుడే ఆమె దేవత. లేనినాడు ఆమె సామాన్యురాలే. మనదేశంలో స్త్రీకి ఎంత గౌరవాన్ని ఆపాదించారో ఆమెపై బరువు బాధ్యతను కూడా పురుషునితోపాటు ఆపాదించినట్లే. తల్లే దైవం, తల్లే గురువు. ఇది ఆచరణలో కూడా సాగిన విషయమే. ఎందరో మహానుభావులకు మొదటి గురువు తల్లే. ఇది అందరికి తెలిసిన విషయమే కదా!

ఇంటిలోనే కాదు స్త్రీని సమాజంలో కూడా గౌరవించవలసిన విధానాన్ని మనుధర్మ శాస్త్రం ఘోషిస్తోంది.

"యత్ర నార్యస్తు పూజ్యంతే, రమంతే తత్ర దేవతాః"

ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు విహరిస్తారు" స్త్రీలను గౌరవించాలని, పూజించాలని చాటిచెప్పే విధానమిది. ఇంతకంటె బాగా స్త్రీలను గురించి చెప్పలేమేమో? పూజలు చేసినంతమాత్రాన దేవతలు ప్రత్యక్షము కారు. స్త్రీని గౌరవించిన చోటనే దేవతలు విహరిస్తూ ఉంటారని ఆ విధంగా తెలియచెప్పారు. మనదేశ సంప్రదాయంలో స్త్రీ శక్తి స్వరూపిణి-ఆదిశక్తి. గ్రామ దేవతలు స్త్రీలే. దేమునితోపాటు కొన్నిచోట్ల అంతకంటే కూడా స్థానమీయబడింది కనకదుర్గ-తిరుపతిలో పద్మావతీదేవి మొదలైనవి. అంతటి శక్తిని స్త్రీకి ఆపాదిస్తూనే అర్థనారీశ్వరుడని, పురుషునిలో సగం స్త్రీ అని పేర్కొన్నారు.

స్త్రీ లేనిదే పురుషుడు యజ్ఞ యాగాది కర్మలకు అనర్హుడని తెలుస్తోంది. యజమానుడు-యజమానురాలు, గృహిణి-గృహస్తుడు మొదలైనవేకాదు కళలో కూడా స్త్రీకి ప్రత్యేక గుర్తింపు నిచ్చారు-నటి-నటుడు, నాయకురాలు-నాయకుడు ఆడకత్తె-ఆటగాడు ఈ విధంగా పుంలింగంవల్ల ఇక్కడ స్త్రీలింగం ఏర్పడంకాదు వారి విద్యా ప్రావీణత వలననే స్త్రీలింగ శబ్దం ఏర్పడినదని చెప్పవచ్చు.

భారతంలో శకుంతల దుష్యంతునికి తెలియచెప్పుతూ.

"సంతత గృహ మేధి ఫలం
బంతయుఁ బడయంగలేవు ననుగుణ భార్యా
వంతుం డగువాడు క్రియా
వంతుడు దాంతుండు బుత్రవంతుండునగు."

భార్య స్థానాన్ని తెలియజేసింది. అంతే కాకుండా "ధర్మార్థ కామ సాధన కాకుండా అన్వయ స్థితికి, సద్గతికి, గౌరవానికి కూడా భర్తకు భార్యే కారణమని చెబుతుంది. భార్యను తిరస్కరించిన వానికి ఇహ, పర గతులు లేనట్లుగా పురాణాలు తెలియజేస్తున్నాయి. దీనినిబట్టి గృహంలో గృహిణి ప్రాధాన్యమేమిటి అందరికి విదితమే.

కాని ఆ సూత్రాలు ఆచరణలో ఎంతవరకూ అన్నదే ఆలోచించవలసిన విషయం. శ్రీరాముడు సీతను అడవుల పాలు చేసిన సంగతి. ద్రౌపదికి నిండు సభలో మానభంగము చేసిన సంగతి, హరిశ్చంద్రుడు కాశీ పట్టణ వీధులలో చంద్రమతిని అమ్మిన సంగతి. దుష్యంతుడు నిండు సభలో శకుంతలను కాదన్న సంగతి ఆ పురాణాలే ఘోషిస్తున్నాయి. అక్కడ ఆ స్త్రీలను కాపాడిందెవరు. వారి ఆత్మ స్థైర్యము మాత్రమే.

గౌరి మొదలైన పండిత స్త్రీల సంగతి కూడా మనకు తెలుసు. ఆధునిక కాలంలో రాణీ రుద్రమదేవి, ఝాన్సీరాణి మొదలగువారు వేళ్ళమీద లెక్కపెట్ట దగిన వీర నారీమణులు ఎందరున్నారు?

నన్నెచోడుని కుమార సంభవంలో పార్వతి, మల్హాణ చరిత్రలో పుష్పగంధి చదువుకున్నట్లు తెలుస్తోంది. కృష్ణ దేవరాయల కాలంలో హరియక్క తన తండ్రిని కుస్తీలో ఓడించిన జగజెట్టిని కుస్తీలో ఓడించినట్లు శాసనాధారముంది.

ఈనాటి స్త్రీ ఎన్నో రంగాలలో ముందంజవేస్తోంది. కిరణ్ బేడీ వంటి వీర నారీమణులు, పి.టి. ఉష వంటి క్రీడాకారిణులు, ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి వంటి సంగీత విదుషీమణులు ఎందరో ఉన్నారు.

కాని ఎందరో మరెందరో సాంఘిక దురాచారాల పడగ నీడలలో పవ్వళించి వున్నారు. లోక కంటకుల విష వలయాలలో చిక్కుకునివున్నారు. సంఘ విద్రోహశక్తుల కబంద హస్తాలలో నలిగి నశించిపోతున్నారు.

స్త్రీకి స్త్రీ శత్రువా కాదు. స్త్రీకి పురుషుడు శత్రువా కాదు. ఆ స్థితిని అధిగమించి స్త్రీ ఎదగాలి. తనకు తానే ఆలంబనగా, తనకుతానే రక్షణగా నిలవాలి.

విద్యతోపాటుగా, వివేకం, ఆత్మ స్థైర్యం పెంపొందించుకోవాలి. రాజా రామమోహన రాయలు, వీరేశలింగం పంతులు మొదలగు మహానుభావుల సేవలను జ్ఞప్తికి తెచ్చుకోవాలి. సంఘంలో పాతుకుపోయిన వరకట్నంవంటి దురాచారాలను, అత్యాచారాలను ఛేదించుకుంటు వెలుగుబాటలవైపు పయనించాలి. స్త్రీ మూర్తి తన శక్తి సామర్థ్యాలను వినియోగించుకొని తనకు తానై నిలిచి దేశ ప్రగతికి పురోగమించాలి.

# చైతన్య స్రవంతి

కాలం కదలుతూనే ఉంటుంది. ఆ కదలికలో ఎన్నో మార్పులు జరుగుతూ ఉంటాయి. కాలం వెంట సమాజం మారుతూ ఉంటుంది.

ఆ మార్పు రెండు రకాలుగా ఉంటుంది. 1) ఉపయోగకరమైన మార్పు. 2) ప్రమాదకరమైన మార్పు.

ఆ మార్పు ఆ కాలంలో ప్రత్యేకంగా జరక్కపోయినా గతంనుంచి వచ్చి ఆ కాలంలో అధికం కావచ్చు. ఆ మార్పు పాతదాన్ని కప్పి సమాజంలో నిలిచి పోతూఉంటుంది.

సమాజం మంచి మార్పుకు స్వాగతం పలుకుతుంది. ప్రమాదకరమైన మార్పుకు సమాజంలో కొంత భాగం నలిగిపోతూ ఉంటుంది. అయినా ప్రపంచాని కంతకు ఆ మార్పు ఒకలా ఉండకపోవచ్చు. దేశ లేక ప్రాంత పరిస్థితులను బట్టి సమస్య ఉంటుంది సమస్యనుబట్టి సమాజం మార్పు కోరుతుంది. ఆ మార్పే కొత్త సమస్యను సృష్టించవచ్చు లేక సమస్యకు పరిష్కారం చేయవచ్చు. ఏదైన సమస్యకు ఆధారం సమాజం. సమాజంలోని జనం. ఈ జనంలో స్త్రీ పురుష భేదం ఒకసారి కనబడవచ్చు. అనగా ఒక సమస్య స్త్రీకి వేరుగా పురుషునికి వేరుగా ఉండవచ్చు.

పిల్లలకు-యువకులకు-మధ్య వయస్కులకు-వృద్ధులకు వేరుగా ఉండ వచ్చు. ఒకరి సమస్య మరొకరికి ఏదీ కాకపోవచ్చు. సాంఘిక సమస్యే సాధారణంగా సమాజంలో ప్రాధాన్యత వహిస్తుంది. అప్పుడే అది సమాజ సమస్యగా పరిగణింపబడుతుంది. ఉదాహరణకు వరకట్న సమస్య లేక కన్యాశుల్కం మొదలైనవి. ఇవి ఈ తరానికి గొడ్డలిపెట్టు. అటు తల్లి తండ్రులకు-ఇటు సమాజాన్ని పట్టి పీడించే సమస్యలు ఇవి. ఈ సమస్యలు అనేకరకాలుగా ఉంటాయి. నేటి నిరుద్యోగ సమస్య మరొక రకమైనది.

దేశపరంగా లేక ప్రపంచ పరంగా తీసుకున్నప్పుడు ఈ సమస్యలు పెద్ద సమస్యలుగా కనబడకపోవచ్చు కాని సమాజ పరంగా తీసుకున్నప్పుడు ఇవి పెద్ద సమస్యలుగా కనబడుతాయి. అందులో స్త్రీ పురుష భేదం స్పష్టంగా కనబడు తుంది.

నేటి సమాజంలో స్త్రీ పురుషులిద్దరు సమానమే. సమాజ శ్రేయస్సుకు ఇద్దరు రెండు కళ్ళవంటి వారు. సమాజ రథానికి రెండు చక్రాలవంటి వారు.

కాని సమాజంలో స్త్రీ పురుష సమస్యలు వేరు వేరుగా కనబడుతున్నాయి. స్త్రీ సమస్య పురుషునికి సమస్య కాకపోవచ్చును.

కాని ఏ సమస్య అయినా ఫలితం ఒక్కటే. సమాజ పురోగతి కుంటు పడుతుంది. అందుకే సమస్య అన్నది సమాజ పురోగతికి చీడపురుగు వంటింది. దానిని ఎంత త్వరగా పరిష్కరించు కుంటే అంత త్వరగా సమాజం అభివృద్ధి చెందుతుంది.

చెట్టు ముందా విత్తు ముందా అన్న వాదన కాదుకాని సమాజంలో స్త్రీ కంటె పురుషుడు అన్ని రంగాల్లోను అభివృద్ధి చెందాడు అనడం యదార్థం. దానికి కార ణం స్త్రీ గృహిణిగా నాలుగు గోడల మధ్య నిలవడం పురుషుడు సమాజంమధ్యలో నిలబడి దాని భారం తాను వహించటమే.

అందువల్ల పురుషుడు సాంఘిక, ఆర్థిక రాజకీయ రంగాల్లో అభివృద్ధిచెంది ఎప్పటికప్పుడు సమాజనిర్మాణానికి కారణభూతుడవుతున్నాడు దేశనాయకునిగా నిలిచిపోయాడు.

వంటపనితో, ఇంటిపనిలో, సంతానభారంలో సతమతమయ్యే స్త్రీ రానురాను మరింత అనాగరికతను పుంజుకుంది, దానితో పురుషునకు స్త్రీ పట్ల గౌరవ భావం తగ్గి తేలికభావం ఏర్పడింది. అంతేకాదు స్త్రీ కేవలం వంటమనిగా దానిసగా, పురుషునకు భోగ వస్తువుగా నిలిచింది.

స్త్రీని లోకువకట్టే పురుషుడు హీనంగా చూడడంవల్లనే సమాజంలో స్త్రీ మరింత హీనంగా చిత్రింపబడింది. ఆ దానిసత్వపు భావంతో స్త్రీలోని శక్తి సామర్థ్యాలన్నీ నశించి దీన స్థితికి దిగజార్చింది.

దానికి సాయం మనువు వంటి ధర్మశాస్త్రాలు స్త్రీని పురుషుని వస్తువుగా చిత్రించి స్త్రీకి ఎన్నో కట్టుబాట్లను అంటకట్టాయి. పురుషునకు సర్వాధికారాలు ఇచ్చాయి. చివరకు ఐతరేయ బ్రాహ్మణంలో పర్వతనారదులు హరిశ్చంద్రుణ్ణి సమీపించి ఆడ శిశువు జన్మించడంవల్ల తల్లితండ్రులకు కలిగే దుఃఖాలు వర్ణించి ఏ విధంగా చూసినా మగశిశువే విధాయకమని భోధిస్తారు. ఈ విధంగా స్త్రీని చిత్రించడంవల్ల సమాజంలో స్త్రీ మరింత ఇబ్బంది పాలయింది.

అంతేకాదు స్త్రీకి వేరు ధర్మాలు పురుషునకు వేరు ధర్మాలు చిత్రించింది. ఒక వ్యభిచారిని తయారు చేసేది సమాజంలోని పురుషులే కాని ఆ పురుషునకు దోషంలేదు. దోషమంతా ఆ స్త్రీమీదే మోపారు. దోషము ఎవరు చేసినా ఒక్కటే శిక్షసమానంగా ఉండాలి. అలా పాక్షికంగా చూపించడం వల్లే స్త్రీ సమాజంలో హీనంగా పరిగణింప బడింది. దానివల్ల సమాజం నీచస్థితికి దిగజా రింది అనడం అతిశయోక్తి కాదు. ఎవరు తప్పుచేసినా తప్పే. తప్పును కప్పిపుచ్చక దానిని నశింపచేసిననాడే సమాజం పురోగతిని సాధిస్తుంది.

ఈ విధంగా స్త్రీ పురుషుల మధ్య దూరం పెరిగింది. పురుషుడు భార్య బతికి ఉండగానే మరో వివాహం చేసుకోడం మొదలుపెట్టడం చివరకు నూరుమంది భార్యలుండేవారు. ఇంతమంది ఉన్నా భార్యలను బాధలుపెట్టి వేశ్యలను మేపే భర్తలుఎందరో. అది నాగరికత అని భావించే మహానుభావులెందరో.

అటువంటి కాలంలో సమాజంలోని కుటుంబాలు ఎన్నో నానా కష్టాలు పడ్డాయి. పురుషునకే చదువు సంధ్యలు సంపాదనలు లేనప్పుడు స్త్రీకి ఎక్కడ నుంచి వస్తాయి. ఉన్న ఆస్తిపాస్తులు తగలబెట్టుకున్నప్పుడు కుటుంబంలోని సభ్యులంతా ఆకలి బాధలు పడక స్వర్గసుఖాలు ఎలా చవిచూస్తారు. అట్టియజమాని ఉన్న స్థితిలో గృహిణిబానిసకాక మహారాణి ఎలా అవుతుంది. ఇక వారి సంతానం బుద్ధిమంతులు కావాలంటె మామూలు విషయంకాదు. పతనం ఒకతరంనుంచి మరో తరానికి వారిసత్వంలా సంక్రమిస్తుంది.

ఆస్థితిలో సమాజంలో స్త్రీల స్థితిమరింత దిగజారిపోయింది. సమాజంలో పాతుకుపోయినకొన్ని దురాచారాలు స్త్రీని మరింత పీడించసాగాయి. ఆ దురాచారాల్లో ఒకటి సతీసహగమనం. 2. బాల్య వివాహాలు 3. కన్యాశుల్కం. 4. విధవత్వం రాజరామమోహన్‌రాయలు. కందుకూరి మొదలగు మహానుభావులు జన్మించి కృషిచేసేవరకు ఆ అగ్ని కారుచిచ్చే మండుతూనే ఉంది. ఎందరో అబలల ప్రాణాలు తీస్తూనేఉంది. వీటిని అర్పడానికి ఆ మహానుభావులు చేసిన కృషి మరువరానిది. సతీసహగమనం ఇంకా అక్కడక్కడ తల ఎత్తుతూనేఉంది. ప్రాణాలతో ఉన్న యువతిని భర్తమరణం పేరుతో చితిలోకి తోసి వేయడం ఎంత అమానుషమో ఊహింపరానిది. అదే విధంగా కన్యాశుల్కం పేరుతో పెద్దలు ధనాశకు లోనై కన్నకూతురుని కాటికి కాళ్ళుచాచిన ముసలి వానికిచ్చి వివాహం చేయడం మహాఘోరం. అంత కంటె ఘోరం వితంతు వేషం. కన్న తల్లితండ్రులే ముక్కుపచ్చలారని బిడ్డకు బలవంతంగా ఆవేషం ధరింపచేయడం తలచుకుంటేనే గుండెలు తరుక్కుపోతాయి. సమాజంలో ఇంతకంటె దురాచారం మరొకటి ఉండదు.

ఈనాడు వరకట్నం దావానంలా వ్యాపించిఉంది. కట్నంచాలదని బాధలు పెట్టి ఎంతమంది యువతుల ప్రాణాలు తీస్తున్నారు. అసలు కొందరి యువతులకు వివాహమే మారమవుతోంది. అటు ముఢాచారాల ముసుగులో ఆడపిల్లకు చదువు చెప్పించని తల్లితండ్రులు ఎందరో ఉద్యోగాలకు పంపించక ఆడపిల్లలను ఇంట్లో పెట్టుకుని వారి భవిష్యతుకు రెండు చేతులు అడ్డు పెట్టే తల్లితండ్రులు ఎందరో ఉన్నారు. ఇటు పెళ్ళిలేక అటు ఉద్యోగం చదువులేక్క ఇళ్ళల్లో ఆడపిల్లలు కుమిలి పోతున్న సంగతి ఆ తల్లితండ్రులకు తెలియడమేలేదు. ఈ వరకట్న నిషేధం ఒక ఉద్యమంలా రావాలి. అప్పుడు కాని ఈ దురాచారం తొలగిపోదు. ఇందుకు స్త్రీ పురుషులిద్దరూ కూడా సమాన బాధ్యత వహిస్తారనే చెప్పాలి. వరకట్నం వెనుక స్త్రీ హస్తమే ఉందని అందరికీ తెలుసు.

ఈ దురాచారాలే కాకుండా స్త్రీ అనేక విధాలుగా నలిగిపోతోంది. దానికి కారణం ఆడ పిల్లను ఒక విధంగా మగపిల్లవాడిని మరో విధంగా తల్లితండ్రులు పెంచిపెద్ద చెయ్యడమే.

స్త్రీలోని చురుకుతనం, తెలివితేటలు స్వభావసిద్ధంగాఉండే ప్రతిభలదశ నీయకుండా అణచి వేయడంవల్ల ఆమెలో భయం, నిరుత్సాహం అమాయకత్వం చోటు చేసుకుంటున్నాయి.

స్త్రీకి ధన సంపాదన లేక ఆర్థికంగా వెనకబడడంవల్ల కూడా ఆమెను సమాజం హీనంగా చూస్తోంది. తల్లితండ్రులు కట్నకానుకలు ఇచ్చినా చాలామంది లో అవి అత్తగారికే చెందటంవల్ల, ఆమెకువేరుగా అస్తి, సంపాదన లేకపోడం వల్ల ఆమె పురుషునిమీద ఆధారపడి బతకడంవల్ల పురుషుడు స్త్రీ కూడా ఆమెను లోకువగా చూస్తున్నారు.

1. ఆ బాధలు ఇబ్బందులు అనేకరకాలుగా ఉంటున్నాయి. స్త్రీని భర్త కొట్టడం, తిట్టడం మొదలుపెట్టాడు. భర్తతోపాటుగా, అత్త, ఆడ బిడ్డలు సాధించడం మొదలు కొట్టడం, తిండి పెట్టకమాడ్చడం మొద లైనవి సమాజంలో ప్రబలి పోయాయి.

2. స్త్రీపై అత్యాచారాలు, ఆమె అబల అని బలంలేనిదని మాన భంగాలు చేయడం, అపహరించడం, వేశ్యలుగా తయారు చెయ్యడం మొదలైన విధంగా దురాచారాలు సమాజంలో పెద్దఎత్తున పేరుకు పోయాయి.

3. అంత కంటె ప్రమాదమైనది స్త్రీని పురుషుని కంటె తక్కువ తనం అంట కట్టి ఆమెకు లేని పోని బంధాలు తగిలించి ఆమెను విద్యా బుద్ధులకు దూరంచెయ్యడం, ఆమె స్వేచ్ఛకు సంకెళ్ళు వేయడం ఆమె ను మరింత బాధించాయి.

4. పురుషుడు ఒక భార్య ఉండగా మరో భార్యను పెళ్ళిచేసుకుని బాధించ డం. సంతానంలేని వంకతో ఆమెను వదిలివెయ్యడం లేక మరో భార్యను తెచ్చి కోడం అసలు కన్యాదానం పేరుతో స్త్రీని పశువులతో, వస్తువులతో సమానంగా దానం చెయ్యడం ఆమెను హీనంగా చిత్రించ డానికి దారితీసింతని చెప్పాలి.

5. స్త్రీకి ఆస్తి హక్కులు లేక చిరాస్తులు అన్నీ పురుషుని పేర చెలామణి అవుతూ ఆమెను అసమర్థురాలిగా చిత్రించాయి.

ఈ స్థితినుంచి స్త్రీని రక్షించడానికి స్వరాజ్యం వచ్చిన తరువాత మన ప్రభుత్వం అనేక చట్టాలు చేసింది. స్వరాజ్యపోరాటంలో ఒక భాగంగా స్త్రీచైతన్యం ప్రారంభమయింది.

అందులో ప్రధానమైన అంశం స్త్రీవిద్య, స్త్రీకి విజ్ఞాన సముపార్జనలో పాటుగా ఆర్థిక స్వాతంత్ర్యంకూడా కావాలి అని గుర్తించారు. అందుకు విద్య అవసరంఅని స్త్రీ విద్యను ప్రోత్సహించడానికి అనేక సదుపాయాలు ప్రభుత్వం సమకూరుస్తోంది. ప్రత్యేకమైన పాఠశాలలు నెలకొల్పారు.ఇంటర్‌మీడియట్ వరకు ఫీజులు లేకుండా చేసారు.అయినా అనుకున్నట్టుగా ఇంకా ఎక్కువమంది బాలికలు ముందుకు రావడంలేదు.

''ఆడవాళ్ళకి చదువెందుకు? ఊళ్ళేలాలా! ఉద్యోగాలుచెయ్యాలా అన్నసామెత ఈనాడు యదార్థమయినా అయినా ఇంకా కొందరి ఇళ్ళలో ఈ సామెత నలుగుతూనే ఉంది.మహిళా పాఠశాలలు, మహిళా కళాశాలలు, మహిళా యూనివర్సిటీ వెలసిన ఈ రోజుల్లో కూడాఇంకాఎంతో మంది ఆడ పిల్లలు కాలేజీచదువులకు దూరమవుతున్నారు.

నిర్బంధ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టిననాడే ఈ సమస్యకు పరిష్కారం లభించవచ్చు.

2. అదే విధంగా బహుభార్యాత్వం మీద కూడా ప్రభుత్వం అనేక చట్టాలు తీసుకువచ్చింది. ప్రభుత్వోద్యోగం చేస్తున్నవారు ఒక భార్యకు విడాకులివ్వనిదే మరో వివాహం చేసుకోకూడదు. అలా చేసుకుంటె చట్టాన్ని ధిక్కరించినట్టే. అటువంటివారి మీద మొదటి భార్య కేసు పెడితే ప్రభుత్వం కోర్టు ఆదేశాన్ని బట్టి చర్య తీసుకుంటుంది. కాని దీనివల్ల స్త్రీకి లభించే న్యాయం తక్కువే అని చెప్పాలి. దానికి కారణం కోర్టుకు దొరకకుండా నేరస్తుడు మౌనం చెయ్యడమే. తిరిగి ఆమెపై లేనిపోని కేసులు పెట్టడం.

భార్య మంచితనాన్ని ప్రేమను అమాయకత్వంగా చిత్రించుకుని పురుషుడు ఆమెకు తెలికుండా మరో కాపురం పెట్టి ఆమె నిండు జీవితంలో నిప్పులు పోస్తున్నాడు. కట్టుకున్న భార్యకే తీరని అపకారం చేస్తున్నాడు.

ప్రభుత్వోద్యోగం అయినా కాకపోయినా, ఉద్యోగం చేస్తున్నా, వ్యాపారం చేస్తున్నా భార్యకు విడాకులివ్వనిదే మరో వివాహం చేసుకోడం నేరమనే చట్టం రావలసిఉంది. చట్టాలేకాదు. చైతన్యం సమాజంలోరావాలి. స్త్రీ సమాజంలోకి రావాలి, సమాజమే శిక్షించాలి నేరస్తుల్ని సమాజం మనకెందుకు అనుకోడం వల్లనే ఈ దురాచారాలు సమాజంలో తలెత్తుకు తిరుగుతున్నాయి.

ఏ చట్టాలు లేకపోయిన బాలబాలికల్ని పెంచి పెద్దచెయ్యడంలో పెద్దలలో మార్పురావాలి. స్త్రీని స్త్రీగా గుర్తించే స్థితి సమాజంలో పెరగాలి.

4. స్త్రీని వంటయింటికి అంకితం చెయ్యడంవల్ల కలిగే నష్టాలు ఇప్పుడిప్పుడె కొందరికి అర్థమవుతోంది. మరి కొందరు ఇంకా ఆ విషయం ఆలోచిస్తూన్నట్లు కనబడదు.

ఎంత తెలివి తేటలుఉన్నా స్త్రీ వీధి గడప దాటనప్పుడు తెలివి తేటలు గుంటలోని నీటివలె స్తంభీభూతమైచి మురికి పాలవుతాయి. విజ్ఞానం జీవనది లాంటిది. కాలంతో పాటు కొత్తదనాన్ని సంతరించికోవాలి. బయట ప్రపంచంతో సంబంధం ఉన్ననాడె విజ్ఞానం నిత్యనూతనమై ప్రకాశిస్తుంది.

5. మనదేశంలో స్త్రీ రాజకీయ, సాంఘిక రంగాల్లో వెనకబడేఉంది. కేవలం వేళ్ళమీద లెక్క పెట్టే సంఖ్యమాత్రం. రాజకీయ రంగంలో కనబడుతోంది. అదిస్త్రీ అభివృద్ధికి నిదర్శనం కాదు. మిగిలినవర్గంపైకి రావలసిఉంది. అలావచ్చిననాడే అసలు దేశా భివృద్ధికనబడుతుంది.

ఉద్యోగం పురుషలక్షణం అన్నారు ఒకనాడు. కాని ఈనాడు ఉద్యోగం స్త్రీ లక్షణం అని అనవలసివస్తోంది. అలావచ్చిననాడె అసలు దేశాభివృద్ధి జరుగుతుంది.

"విద్యావిహీనన్యపవురి" అన్ననీతి కేవలం పురుషులకుకాదు. స్త్రీ పురుషులిద్దరికి సమానంగా వర్తిస్తుంది. మూఢాచారాల ప్రభావంవల్ల ఇంటిలోని పెద్దలు ఆ విషయాన్ని గురించి ఆలోచించకుండా కేవలం దాన్ని పురుషునకు మాత్రమే వర్తింపచేసుకుని మిగిలిన భాగం కప్పి పుచ్చుతున్నారు. సమాజ శ్రేయస్సుకి అపకారం చేస్తున్నారు.

6. ప్రతిమతంలోను, ప్రతికులంలోను ఈ స్త్రీపురుష భేదం కనబడుతూనె వుంది. భౌతికంగా రూపంలో స్త్రీ పురుషులకు భేదం సహంకాని ఆలోచనా విధానంలో, విజ్ఞానంలో, వివేకంలో, ప్రేములో ఆదరణలో తెలివితేటలలో స్త్రీ పురుషులకు భేద ఎక్కడ చెప్పండి?

7. వయసు వచ్చిన పిల్ల గుండెలమీద కుంపటి అని ఆ బరువు ఎంత త్వరగా దించుకుంటె అంతమంచిదని భావించేవారు నేటికి ఎందరో ఉన్నారు. ఏదో విధంగా కుమార్తెకు వివాహం చేసి అత్తవారింటికి పంపి భారం దించుకోవాలనె చాలా మంది నేటికి ఆలోచించడం అవివేకమవుతుంది.

స్త్రీ కుటుంబాన్ని చూసుకుంటే పురుషుడు ఆర్థిక సాంఘికరంగాలో పని చేస్తాడన్నది యదార్థమే కాని స్త్రీకి అంతకంటె అధికమైన చాకచక్యం, తెలివి,

ప్రతిభ ఉన్నప్పుడు అవి అడవిలోకాచిన వెన్నెలే అవుతాయి. అలా వ్యర్థం చెయ్యడం అనాగరికత లక్ష్యమేకదా.

కొందరి స్త్రీల శక్తి సామర్థ్యాలు పరిశీలిస్తే పురుషునికి ఏమాత్రం తీసిపోకని రుజువవుతుంది. అంటే పురుషు తో పోటీకాదు. పురుషునిపై ద్వేషం కాదు. కాని సమాజంలో ఉన్నత స్థానంలో ఉన్నవారితో వెనుకబడిన వర్గాన్ని పోల్చుకున్నాడే అసలు స్థితి విదితమవుతుంది.

కాకతి రుద్రామదేవి, ఝాన్సీరాణి, చరిత్రలు పరిశీలిస్తే స్త్రీవారి సాహసం తెలివి విదితమవుతాయి. ఇక సరోజినీ నాయుడు, విజయలక్ష్మి పండిట్, బండారు నాయకి ఇందిరాగాంధి, నేడు బెనజీర్ బుట్టో ఎందరో మనకు తెలుసు వీరుగాక ఎన్నో రంగాల్లో ముందంజవేసిన స్త్రీలు ఎందరో ఉన్నారు.

ఈనాడు దేశంలో ఒకవర్గం స్త్రీలు సాంఘిక దురాచారాల ఇనుప కవచంలో ఇరుక్కుపోయి నానాబాధలు పడుతున్నా మరోవర్గం శక్తి సామర్థ్యాలు ప్రదర్శిస్తూనే ఉంది. సమాజ భారాన్ని తన భుజస్కంధాల మీద భరిస్తూనేఉంది.

ఉదాహరణకు పోలీసు శాఖల్లో విమాన శాఖల్లో, ఉద్యోగాల్లో, డాక్టర్లగా, ఇంజనీర్లుగా, లాయర్లుగానే కాకుండా రాజకీయ రంగంలో, సాంఘిక రంగాల్లో వెలకాని స్థానాలు అందుకున్నారు.

చైతన్యం అంతటా వెల్లి విరియాలి. విదేశాలను పరిశీలిస్తే అక్కడ స్త్రీలు మనకంటే ముందుగానే ఎంతో అభివృద్ధిని సాధించారు. కాని కొన్ని లోపాలు కూడా తల ఎత్తుతున్నాయి.

ఆ లోపాలు పరిశీలించుకుంటూ విచక్షణా జ్ఞానంతో స్త్రీ ముందడుగుకు వేయాలి. పురుషునిపై తిరుగుబాటు కాదు ప్రధానమైంది. వివేకం, విజ్ఞానం విద్యతోపాటు సంపాదించుకోవాలి. మానసికంగా ఎంతో ఎదగవలసింది. స్త్రీ పురుషుల మధ్య పెరగవలసింది దూరంకాదు. సభ్యత ఈ పోరాటంలో విజయం సాధించుకోవలసిన అవసరం ఎంతైన ఉంది. సాధించుకోగల ధైర్య సాహసాలు, శక్తి, సామర్థ్యాలు అమల్లో ఉన్నాయి.

స్త్రీకి స్త్రీ శత్రువనే వాదన నశించిపోవాలి. అత్తగా, తల్లిగా, సోదరిగా, భార్యగా, కార్యకర్తగా, సంఘసేవకురాలిగా తన బాధ్యత నిలబెట్టుకోవాలి.

ముందు వ్యాసాలలో సమస్యలు వివరంగా చర్చించుకుందాము.

-: O :-

# స్త్రీలు - ఆటలు

ఆటలు ఎంత ముఖ్యమో ఈనాడు అందరికి తెలిసిందే. దేశప్రగతి ఆటలు మీద ఆధారపడిందంటే అతిశయోక్తి కాదు. నేడు ప్రభుత్వం బాలబాలికలకోసం ఎంతో డబ్బు వినియోగిస్తోంది. ఆటలు ఆరోగ్యానికి చిహ్నం, ఆరోగ్యమే మహా భాగ్యం కదా!

నేడు ఆటస్థలాలు కేటాయించింది ప్రభుత్వం. ఆటలు నేర్పడానికి, ఆటలకు ఎంత డబ్బు ఖర్చు పెడుతోంది. పోటీలు అంతర్జాతీయ స్థాయిలో జరుగుతున్నాయి. బాలికలు, బాలురతో సమానంగా ఆడుతూనే ఉన్నారు. కాని వయస్సు వచ్చిన బాలికలలో క్రమంగా ఆశ్రద్ధ తగ్గుతోంది. ఆటల పోటీలకు వెళ్లేవారు తప్ప మిగిలినవారిలో ఆటలపై శ్రద్ధ కనబడదు. ఆటలు ఆరోగ్యాన్ని కపాడుతాయి. ఉత్సాహాన్ని, తెలివిని, పెంచుతాయి అన్నప్పుడు బాలికలు పెరుగుతున్న వయసుతోపాటు ఆటలు అభివృద్ధి చేసుకోవాలి. అందులో పెళ్ళి అయిన తరువాత స్త్రీలు చదువు మానేవేసినట్లుగానే ఆట పాటలన్నిటినీ మరిచిపోతున్నారు. పెద్దవారు కూడా దీనికి కొంత కారణమనే చెప్పాలి. వారు స్త్రీలకు ప్రోత్సాహాన్ని అందించరు సరికదా నిరుత్సాహాన్ని కలగచేస్తారు. పెళ్ళిఅయిన తరువాత చదువుకు స్వస్తి చెప్పినట్లుగానే ఆడపిల్లలు ఆటలకు కూడా దూరమవుతున్నారు. నిజంగా దూరం కాకూడదు. అలా జరిగిన నాడే సమాజం మరింత నాగరికతను, అభివృద్ధిని సంతరించుకుంటుంది.

నేటికి ఆటలు ఆడపిల్లలు ఆడితే తప్పనే మూఢనమ్మకం సమాజంలో పాతుకుపోయింది. అది తొలగిననాడే అసలు అభివృద్ధి కనబడుతుంది.



# స్త్రీలు - ఆర్థిక సమస్యలు

ఆధునిక సమాజంలో స్త్రీ ఎన్నో రంగాల్లో ముందంజ వేస్తోంది ముందంజ వేసింది కూడా. ఒకవిధంగా చూస్తే స్త్రీ సమాజంలో పొందవలసిన గౌరవాన్ని ఆదరణను పొందుతూందనే చెప్పాలి. మగవారితో సమానంగా అన్ని హక్కులు సంపాదించింది. సామాజిక రంగంలో ఎన్నో చట్టాలు తెచ్చుకుంది. జీవన విధానానికి వెలుగుబాటలు వేసుకుంటోంది. కాని తరచి చూస్తే ఆచరణలో ఇంకా అన్ని హక్కులు బారెడు వెనక్కే వున్నాయి.

కొడుకులు, కూతుళ్లు సమానమే అని అనుకుంటున్నా యే కూతురికి కొడుకుతో సమానంగా ఆస్తి పంచి యిచ్చారు సరికదా! కొడుకుతో సమానంగా చదువు చెప్పించడానికి ఎంతోమంది నేటికి యిష్టపడడంలేదు. ఆ చదువుకయ్యే ఖర్చు పెట్టి పెళ్ళిచేసి అత్తవారింటికి పంపివేస్తే తీరిపోతోంది.బాధ్యత అనుకుంటున్నారు కూడా!

కొడుకుతో సమానంగా ఆస్తి పంచిపెడితే కూతురు కర్మకాండ చేస్తుందా! లేక ముసలికాలంలో కాపాడుతుందా। ఇంకా మన సమాజంలో కూతురు ఇంట్లో ముసలికాలంలో తల్లితండ్రులుంటే హర్షించే ఉదారత్వం ఉన్నదంటారా? లేనే లేదు. నాలుగురోజులు చుట్టము చూపుగా వెళ్ళి ఉంటేనే కూతురు అత్తమామలు కోడల్ని బతకనివ్వరు. లోకం నిలవ నివ్వదు. అటువంటప్పుడు కూతురికి ఆస్తి పంచి యిచ్చిన ఆ తల్లిదండ్రులకు లాభమేముందో ఆలోచించాలి. తల్లితండ్రుల ఆస్తులలో కొంతభాగం ముసలికాలంలో వారికి రక్షణగా నిలవడం సహజంకదా। అందుకే మునపటి ముసలమ్మలు కొందరు ఒక బంగారు నగను దాచి ఉంచుకొని ఆఖరి రోజులలో తనను చూచినవారికి అందించేవారు ఆడపిల్లలే పుడితే వంశాకురం లేదని మగబిడ్డను తెచ్చి పెంచుకుని ఆస్తిని అప్పగించే ఉదారులెందరో నేడు ఇంకా ఉన్నారు. తల్లితండ్రులకు కర్మకాండ చేసే అధికారం ఆడపిల్లలకు లేనప్పుడు ఆమె ఏమి చెయ్యగలదు? ఆ తల్లితండ్రులు మాత్రమేమి చెయ్యగలరు.

మరి ఆస్తి పంచుకొన్న కొడుకులు, కోడళ్ళు ముసలివారిని చూస్తున్నారా? ఆదరిస్తున్నారా? ఆస్తులను పంచుకుంటున్నారు కాని అంత ప్రేమతో తల్లితండ్రులను పలకరించే కొడుకులెవరు? మరి కూతురు విషయంలో అంత సంకుచిత భావం ప్రదర్శించిన ఆ తల్లితండ్రులకు బాధలే ఎదురవుతున్నాయి, కనీసం కర్మకాండ చేస్తారన్న ఆశ కూడా నేడు లేకుండాపోతోంది. ఆస్తిని, పరపతిని పెంచి వంశ గౌరవాన్ని కాపాడుతారన్న ఆశ కూడా నేడు సన్నగిల్లిపోతోంది. అయినా కూతుర్ని సమానంగా చూసే భావం పెరగడంలేదు.

అందరికీ ఆస్తులున్నాయని కాని అందరి భావాలు సంకుచితమని కాని ఈ వ్యాస ఉద్దేశం కాదు. ఆస్తిపాస్తులున్న వారి కుమార్తెలు కూడా బాధలు పడుతున్నారు. భర్తచేత, అత్తమామలచేత అవమానాలు పొందుతున్నారు. అందుకే ఈ వ్యాసం రాయవలసి వస్తోంది.

సంపాదకురాలైన స్త్రీకిగాని, భర్త మంచితనంతో సంసారము సాగిపోయే స్త్రీకిగాని, కష్టపడుతున్న సంసారము సాగిపోయే స్త్రీకిగాని పుట్టింటినుంచి ఆస్తి వాటా రాకపోయినా ఇబ్బందిలేదు. అవసరములేదు. కాని అత్తవారింట్లో బాధలు పడే స్త్రీకి, చదువులేక, సంపాదనలేక అత్తవారింట్లో కష్టపడే స్త్రీకి చెడు అలవాట్లు గల భర్త చేతిలో నలిగిపోయే స్త్రీకి పుట్టింటి అండదండలు చాలా అవసరం. ఆమెను కనిపెట్టి చూసే బాధ్యత వారికుంది. ఆస్తులు ఉన్నవారు, ధనవంతులు, కనీసం తిండికి, గుడ్డకు లోటు లేనివారు కూతుర్ని ఆదరించాలి. ఆమె సమస్యను సరిదిద్దుకునే బాధ్యతను స్వీకరించాలి. ఆమె కాళ్ళమీద ఆమెను నిలబెట్టేవరకు చేయూతనివ్వాలి. అంతేకాని చచ్చినా బ్రతికినా నీకు అత్తిల్లే గతి అని తమ పరువు ప్రతిష్ఠలు ఎక్కడ భంగపడతాయోయని ఆమె ముఖం చూడని పుట్టింటి వారుండడం నిజంగా బాధాకరం. అటువంటి సంకుచితత్వంగల వారి చేతిలో పెరిగిన స్త్రీకి కష్టాలతో సమాజాన్ని ఎదిరించి నిలబడగలశక్తి ఎక్కడ నుంచి వస్తుంది? అందుకే ఆత్మహత్యకు పాల్పడుతోంది. లేదా నిత్యం అత్తవారింట్లో నరకయాతన పడుతోంది. మరి సమాజంలో ఈ చిక్కు సమస్యకు పరిష్కారం దొరికేదెప్పుడు.

ఇటువంటి సంసారాల్లో స్త్రీ ఎక్కువ చదువుకోడానికికాని, ఉద్యోగం చెయ్యడానికికాని, ఉద్యోగం చేసినా సంపాదన కాస్త స్వేచ్ఛగా ఖర్చుపెట్టుకోడానికి కాని ఏ అత్తవారు సహించరు. అత్త మామల సంగతికేం కాని కనీసం కట్టుకున్న భర్త కూడా అందుకు అంగీకరించక పోవుట ఎన్నోచోట్ల చూస్తున్నాం అందుకే స్త్రీ నసందపాపరురాలైన ఆర్థికంగా ఇబ్బంది పడుతూనే ఉంది. భార్యకు అందచందాలు చదువుసంపాదనలు లేకపోయినా ఆదరించి భార్యను భార్యగా, చూసే భర్తలు ఎందరో ఉన్నారు. అందరూ అలాగే ఉంటే సమస్యే లేదు. లేని చోట పరిష్కారం దొరకవలసి ఉంది.

అందుకే మన పెద్దలు ఎందరో స్త్రీకి విద్యతోపాటు ఆర్థిక స్వాతంత్ర్యం కావాలన్నారు. విద్య విజ్ఞానానికి సంపాదనకు కూడా కావాలి, విద్య జీవితాలకి వెలుగు నిచ్చే మణిదీపం. విద్యతోపాటు గుండె నిబ్బరం, ఆత్మ విశ్వాసం సంస్కారం ధైర్య సాహసాలు పెంపొందుతాయని అందరి నమ్మకం. అందుకే స్త్రీ ముందుకు రావాలి. అందుబాటులో ఉన్న హక్కులు అంది పుచ్చుకొని జీవనదిలా ముందుకు సాగి పోవాలి. సమాజంలో అడ్డదిడ్డంగా అల్లుకుపోయిన జటిల సమస్యల చిక్కు విడతీసి విజయం సాధించాలి.

—0—

# స్త్రీలు - స్నేహాలు

స్నేహాలు ఆకాశమంత విశాలమైనవి. భూమంత భారమైనవి. నిప్పంత ప్రమాదమైనవి. స్నేహమంటే యిష్టంలేనిది ఎవరికి? అందరికి లడ్డూ తినడమంత యిష్టం. మనుషులు మనుషులు స్నేహాలు చేస్తారు. కుటుంబాలు, కుటుంబాలు స్నేహాలు చేస్తాయి. ఒక్కొక్కప్పుడు ఆడవారు మగవారితో స్నేహంగా ఉండడానికి, మగవారు ఆడవారితో ఎక్కువగా స్నేహంగా ఉండడం కూడా కనబడుతుంది.

ప్రేమ, వాత్సల్యం, అభిమానం, మోజు, ఇష్టం యిలాంటి భావాల ప్రతిరూపమే స్నేహం. అసలు స్నేహానికి ఆడ, మగ తేడా ఏమిటంటారు స్నేహంమీద మోజువున్న కొందరు, నిజానికి స్నేహంలో తేడా లేదు. లింగభేదంవల్ల స్త్రీ పురుషుల మనసుల్లోనే తేడా, అయినా ఎవరితో స్నేహమైన హద్దులు దాటనంత వరకే హద్దులు దాటితే ఎవరితో స్నేహమైనా ప్రమాదమే. స్నేహం సెలయేరులా గలగల పారుతుంది. చెరుకు రసంలాతీపిగా వుంటుంది. మితిమీరితే వేపాకులా చేదుగా కూడా ఉంటుంది.

ఈ స్నేహాలు రకరకాలు. కొందరి స్నేహం కబుర్లవరకే. మరికొందరి స్నేహం సినీమాలు, షికార్లు, హోటళ్లు పార్కులు మొదలగు చోట్లకి వెళ్లేవరకు పెరుగుతుంది. మితిమీరితే మగవారి స్నేహం బార్లు పేకాటలు, రేసులు చవి చూస్తాయి. అసలు కొంతమందికి స్నేహం అక్కడే ప్రారంభమవుతుంది. సమాజానికి చెరువు చేసే స్నేహాలు నిజానికి చాలా ప్రమాదకరమైనవి. ఆ విషయం తెలిసి కూడా మానలేనివారు ఎందరో. స్నేహితుల్ని వదలలేనివారు ఎందరో? నిత్యం చూడకుండా ఉండలేనివారు ఎందరో?

మరికొందరి స్నేహం అవసరాలకు ఆదుకునేవరకు ఉంటుంది. ఎవరిని చూస్తే ఎవరికి స్నేహం చెయ్యబుద్ధవుతుందో ఎవరు చెప్పలేరు. కొందరు స్నేహం చెయ్యడానికి భయపడి ఎవరితోను ఎక్కువ చనువుగా వుండరు? అలాంటివారిని సమాజం ఎక్కువ పట్టించుకోనే పట్టించుకోదు.

ఇరుగు పొరుగు స్నేహాలు, క్లాసురూము స్నేహాలు, బస్సుల్లో, బస్సు స్టాపుల్లో, బజార్లలో, షాపుల్లో, స్నేహాలు, హోటళ్ళల్లో, పొరుగూర్లలో రైల్వే ప్లాట్‌ఫారాలమీద, రైళ్ళ కంపార్టుమెంటుల్లో, విమానాల్లో, తీర్థయాత్రల్లో, ఇలా ఎన్నిచోట్లో స్నేహాలు కలుస్తూ ఉంటాయి.

స్త్రీలు కూరగాయలు కొనుక్కోడానికి, బజారుపన్లు చేసుకోడానికి అల్లికలు కుట్లు నేర్చుకోడానికి, పిండివంటలు వండడం, ఊరగాయలు పెట్టుకోడం, మొక్కలు పెంచుకోడం మొదలైన సందర్భాల్లో స్నేహాన్ని పెంచుకుంటారు. స్నేహం అతిసున్నితమైంది. ఒక్కమాట తేడా వచ్చిన జీవితాంతం కలుసుకోని వారు కూడా ఎందరో ఉంటారు ఒకసారి విడిపోయి తిరిగి స్నేహం చిగురించి నప్పుడు దాని ఆత్మీయత వర్ణించరానిది.

చిన్నపిల్లల్లో స్నేహం తమాషాగా ఉంటుంది. చిన్నపిల్లలు ఎక్కువగా ఆడుకోడానికి, చదువుకోడానికి స్నేహం కలుపుతారు. ఆటల్లో ఎక్కువ పోట్లాటలు వస్తాయి. తిట్టుకోడంతో ఆగక కొట్టుకోడంవరకు వెడుతుంది. కాని కాలవడం ఎంతసేపని తడిబట్ట ఆరినంతసేవు పట్టదు. మనిషి సంఘజీవి. స్నేహం పునా దుల మీదే సమాజం నడుస్తుంది. స్నేహానికి చిహ్నం చిరునవ్వు. చిరునవ్వు ఆరోగ్యప్రదం కదా!

వయసుమీరిన వారి స్నేహం మరోరకంగా ఉంటుంది. ఆడవారయితే ఇంటి కబుర్లు, వంట కబుర్లేకాదు, పురాణాలు, భగవద్గీత మొదలైనవి చదవడం వినడం, దేవాలయాలు సందర్శించడం, తీర్థయాత్రలు చేయడం మొదలైన కాల క్షేపాలు ఎన్నో. అందులో లోకాభిరామాయణం కూడా అంతర్భాగంగా ఉంటుంది.

ఈ స్నేహాలు కొనసాగినా, మధ్యలో ఆగిపోయినా అంత నష్టమేమి కాదు. కాని కొందరి స్నేహంవల్ల దురభ్యాసాలు అలవాటవుతాయి. ఆస్తిపాస్తులు నష్ట మవుతాయి. మరి దాన్ని స్నేహం అనలేముకదా! స్నేహితుడు హితవు చేసేవాడే.

ఈ స్నేహాలు ఒకఎత్తు, యువతీ యువకుల స్నేహం మరొక ఎత్తు. వివేక వంతుల్లో సాఫీగా సాగిపోతూనే ఉంటుంది. కాని సెక్సు తేడా మూలంగా స్నేహం లో మార్పువచ్చి స్పర్శలకు, ముద్దులకు కౌగిలింతలకు దారి తీస్తుంది. వివాహం చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఇద్దరిలో ఎవరు ముందుకు రాకపోయినా ప్రమాద పరిస్థితికి దారి తీస్తుంది. అమ్మాయి ఆత్మహత్యకు సిద్ధపడవచ్చు. లేక అబ్బాయి దేవదాసు కావచ్చు. స్నేహం చేసేటప్పుడు ఉండే చొరవ ధైర్యం వివాహ విషయం వచ్చేటప్పటికి ఇద్దరూ నీరుకారిపోతారు. పెద్దలు అంగీకరించ వచ్చు లేక అభ్యంతరం పెట్టవచ్చు. ప్రేమించే శక్తే కాని ఎదిరించే శక్తిలేని ఆ యువతీ యువకులు ప్రమాదకరమైన సాహసాలు చేస్తారు. చదువులు పూర్తి ఆయ్యేవరకు ఓపికపట్టరు, సంపాదనలు వచ్చేవరకు ఆగరు, ఇంక ఆ స్నేహం ఏరకంగా నిలుస్తుంది. కొందరు దులుపుకు వెళ్లిపోయేవారు ఉంటారు. అలాటివారు ఉంటే ఏ సమస్యా ఉండదు?

ఇవన్నీ కాకుండా కొందరు కనపడ్డవారితో స్నేహం గలగల ప్రారంభిస్తారు. కొత్తనిండా వారి అడుగుజాడలే అవి మూడునాళ్ళే. నాలుగోరోజు అభిప్రాయ భేదాలు మాటలు నాస్తి. అయిదోరోజు ఒకరిమీద ఒకరు నేరాలు. ఈ స్నేహాలకి ఆడమగా తేడా లేదు. ఏ వర్గమైన ఒక్కటే.

ఇంక భర్తగారికి ఆడస్నేహాలుంటే ఆ భార్య అనుమానానికి, అలకలకు, ముక్కు చీదరింపులకు అంతే ఉండదు. భార్య స్నేహం కాదుకదా కాస్త మగ వారితో గట్టిగా మాట్లాడినా ఆ భర్త కుప్పిగంతులేస్తాడు, భార్యను కొడతాడు తిడతాడు. చివరకు విడాకులు కూడా ఇవ్వగలడు. ఈ స్నేహాలు ఎంత ప్రమాద మైనవో, వేరే చెప్పనవసరంలేదు. అయినా వివేకవంతుల స్నేహం ఆడమగ భేదం పాటించదు. సాఫీగా సాగిపోతూనే ఉంటుంది. అందుకే స్నేహం కూడా మంచితనంమీద ఆధారపడి ఉంటుంది నమ్మకంమీద స్నేహం పందిరి వేసుకుంటుంది. అన్నిటికంటే స్నేహానికి ముఖ్యమైనది హద్దులు. ఏదైనా మితిమీరితే ప్రమాదమే ఒకరోజు స్నేహితులమని చెట్టపట్టా లేసుకుని మరునాడు నిందించుకుంటే అది స్నేహమవుతుందా! ఎవరితో స్నేహం చెయ్యాలో, ఎంతవరకు చెయ్యాలా ముందే ఆలోచించుకోవాలి. ఒడుదుడుకులుగా జీవితాన్ని సాగించడం ఎప్పటికైన ప్రమాదమేకదా! అందుకే మంచి స్నేహాన్ని సంపాదించుకోవాలి. కలకాలం కలకలలాడాలి. ధనంకంటే మిన్న మంచి స్నేహితులు దొరకడం ఆ పద్భాంధవి స్నేహమేకదా। మంచి స్నేహితులు ఒక్కరున్న చాలు. అదే నిండు తనం జీవితానికి.

—0—

# స్త్రీలు - వస్త్రధారణ

ఏ పత్రిక చూసినా, ఏ వార్త విన్నా స్త్రీల మానభంగాల గొడవే, నాగరికత ఎన్నో రెట్లు పెరిగిపోయిన ఈ సమాజంలో అమానుషత్వం ప్రబలి అక్రమాలకు విక్రయించే తీరుతోంది.

సమాజంలో స్త్రీ మొదటినుంచి అబలగానే చిత్రించబడుతోంది. అహంకారులచేతిలో కీలుబొమ్మలా కామాంధుని కంటికి ఆటబొమ్మలా కనబడుతోంది. ఇంత ఘోరం జరుగుతుంటే సమాజం వారిని అరికట్టలేక స్త్రీలపై విరుచుకుపడి స్త్రీల ప్రవర్తన, స్త్రీల వస్త్రధారణే కారణమని విమర్శిస్తారు.

ఏ స్త్రీ అయినా వారి నాగరికతనుబట్టి. వారి కుటుంబ అలవాట్లనుబట్టి స్త్రీ వేషధారణ ఉంటుంది నాగరికతా ప్రపంచంలో నరదాలనుబట్టి వస్త్రధారణ మారవచ్చు. అంతమాత్రంచేత ఆమెను హేళన చెయ్యడానికి కాని మానభంగం చెయ్యడానికి కాని ఎవరికి అధికారం లేదు.

స్వార్థంతో ఎదిగిపోతున్న మనిషి దురలవాట్లకులోనై అధికారభయాన్ని సంఘ భయాన్ని చివరకు పాపభీతిని వదిలి రాక్షసులకంటె హీనంగా ప్రవర్తిస్తున్నారు. రాక్షసుడైనా, రావణాసురుడు కూడా భయపడ్డాడు సీతను అపహరించినప్పుడు ఆమెను బలవంతంగా తాకడానికి కూడా భయపడ్డాడు. నేడో వీరు రాక్షసులను మించిన నిశాచారులు వీరు.తాగినమైకంలో ఏం చేస్తారో వారికే తెలియదు స్త్రీ వేషధారణే వారిని రెచ్చగొడుతుందని చాలామంది ఇప్పటికి భావిస్తున్నారు. వెగటుగా అవయవవాలు బహిర్గతమయ్యేటట్టుగా వస్త్రాలు ధరించడం ఉచితమని ఎవ్వరూ అనరు. కాని అందరిని మెప్పుకోసం వేషధారణ ఉండాలనడం సమజసం కాదుకదా! పల్లెలలో ఇప్పటికి రవికలు లేకుండా పనిపాటలు చేసుకొనే స్త్రీలు ఎందరో ఉన్నారు. మరి స్త్రీల వస్త్రధారణే మానభంగాలకు దారితీస్తే మరి వేరే సంగతేంగాను?

సమాజాన్ని కాపాడే పోలీసులు కూడా ఈ పాపంలో పాలు పంచుకుంటున్నారు. ఇంక జనానికి వారి భయం ఎక్కడిది. చేను చుట్టూఉన్న కంచె చేనును మేస్తుంటే కాపాడేదెవరు? అందుకే జనం తమని తామే కాపాడుకోవాలి? లేనిపోని వంకలు పెట్టి స్త్రీని బెదిరించడం సమసిపోవాలి? సమాజంలో చెడు ఏది జరిగినా దానికి స్త్రీయే కారణమనడం అవివేకమవుతుంది.

స్త్రీలను, వెక్కిరించే వేటగాళ్ళను, పరిహాసించే వంచకులను, మాన

భంగాలు చేసే క్రూరులను, మోసగించే వేషగాళ్ళను సమాజంనుండి తరిమి వెయ్యాలి. స్త్రీ ధైర్యంగా నిలబడే రోజు కోసం ఎదురుచూద్దాం.

కాలం చాలా అమూల్యమైంది. ధనంకంటే పొదుపుగా కాలాన్ని మనం వినియోగించుకుంటే జీవితంలో ఎన్నో సాధించుకోగలుగుతాము. కాని కాలాన్ని మాత్రం సంపాదించలేము కదా! అది మనకంటే ముందుపుట్టి మనల్ని శాసిస్తోంది ఒకరోజులోని 24 గంటలలో ఒక సెకను కూడా మనం చేర్చలేము.

కాలం మనకు తెలీకుండానే గడచిపోతూ ఉంటుంది. మనిషి చిన్నతనం నుంచి ఎన్నో బరువు బాధ్యతలను భరించవలసి వస్తుంది. ఇందులో ఆడమగ భేదం లేకపోయినా ఇక్కడ మనం స్త్రీల సంగతి మాత్రమే చెప్పుకుంటున్నాము. ఒక గృహిణిని మనం చర్చించుకుంటే ఆమెకు గృహంలో అన్నీ బాధ్యతాయుతమైన పనులే ఇక సంతానవతియైన స్త్రీల సంగతి వేరే చెప్పనవసరంలేదు, కాని ఆ పనులను ఒక నియమితకాలంలో నెరవేర్చుకొని సాధ్యమైన దానిని తప్పించుకొని కాలాన్ని మరికొన్ని పనులు చెయ్యటానికి వినియోగించుకుంటేనే ఏ స్త్రీయైన జీవితంలో విజయం సాధించుకోగలుగుతుంది.

అయితే చాలామంది పిల్లలుండి, లేక ఉమ్మడి కుటుంబాలలో అత్తమామల అదుపు ఆజ్ఞలలో ఉన్నవారి సంగతి ఆలోచించాలి. గృహాన్ని తన స్వశక్తితో తీర్చిదిద్దుకునే స్త్రీ ఉత్సాహవంతురాలయితే దేనినైన సాధించగలుగుతుంది. కాలాన్ని ఏదోవిధంగా కాలక్షేపం చెయ్యకుండా ముఖ్యమైన పనులకు మాత్రమే జీవితనావను నడుపుకుని జీవిత గమ్యాన్ని చేరుకునే స్త్రీ ఉత్తమ గృహిణిగా చెప్పుకోవచ్చు.

ఇంటి పనులు ప్రతి స్త్రీకి తప్పవు. పనివారు ఉన్నా కొన్ని పనులు తప్పవు. ఆ పనులు చెయ్యడంలో నేర్పరితనం లేకపోతే అవి తెమలవు. ఇక కొందరికి చాదస్తం ఎక్కువగా ఉంటుంది. దానివల్ల లాభంకంటే నష్టమే ఎక్కువగా కనబడుతుంది. కొంతమంది తుడిచేన నేల తుడవడం, తోమిన గిన్నె తోమడం మొదలైనవిగా చేస్తూ ఉంటారు. వారు పనులు తెముల్చుకుని బయటపడడం కనబడదు అప్పుడు ఆమె పిల్లలపై ఏమి శ్రద్ధ చూపగలదు? మాసిన బట్టలతో, చింపిరి జుట్టులతో, నీరసంగా కనబడతారు. ఆ గిన్నెలు తోమడంతో ఉన్న శ్రద్ధ పిల్లం మీద చూపిస్తే ఎంత బాగుంటుంది చెప్పండి. చేతులు, కాళ్ళు వరిసిపోయి అసహ్యంగా కనబడతారు. బండలు, గిన్నెలు మురికిగా ఉంటే శుభ్రపరుచుకోడం సమంజసమేకాని కేవలం దానికి ప్రాధాన్యత ఇవ్వడం కాలాన్ని వృధా చేసుకోడమే అవుతుంది. మరి వీరికి దేనిపట్ల శ్రద్ధ ఉండదు.

వీరికి వ్యతిరేకంగా కొంతమంది బాహ్యికమైన ముస్తాబుకోసం వినియోగిస్తారు. తరచు ముఖం కడిగి పౌడరు రాసుకోడంతోపాటుగా పువ్వులు ధరించడంలో, రోల్డుగోల్డు నగలు ధరించడంలో ఎక్కువ శ్రద్ధ చూపిస్తారు. అన్నిటి

కంటే అది ఎక్కువని భావిస్తారు. పైగా ఇతరులు తమంత ముస్తాబులో లేరని వారంతా అనాగరికులని భావిస్తారు మరి వీరి ఇళ్ళుచూస్తే. ఎక్కడివస్తువు లక్కడే ఉంటాయి. పిల్లల సంగతి చెప్పనవసరంలేదు. చక్కగా సింగారించు కోడం, స్త్రీకి సహజమే కాని దానికే ప్రాధాన్యత ఇవ్వడం సహజం కాదుకదా! దానివల్ల ధనం కాలం కూడా వృధాయే కదా!

ఇంకా కొంతమంది స్నేహితులు, సినీమాలు, షికార్లు, పార్టీలు, విందులు, వినోదాలలో మునిగిపోతూ ఉంటారు. సినిమా రిలీజు అయిన రోజున చూసి తీర సిలసిందే. దానివల్ల జీవితంలో సాధించుకున్నది ఏదీ ఉండదు. ఇంకా స్నేహాలు కూడా మితిమీరి ఒక్కొక్కప్పుడు గృహకలహాలకు దారితీస్తూ ఉంటాయి ఏదైనా పరిమితిదాటితే ప్రమాదమేకదా! కొందరు భర్త ఆఫీసుకు వెళ్ళగానే ఇరుగు పొరుగుల ఇళ్ళకి బయలుదేరుతారు. ఇక వాగడ లో అనేకమైన అసందర్భపు మాటలు దొర్లుతూనే ఉంటాయి. పోనీ తగిన పని ఉందా అంటే అదీకాదు. వారు తమ కాలంతో పాటుగా ఇతరుల కాలం కూడా వృధా చేస్తూ ఉంటారు. ఇక వారి సంతానం కూడా అదే మార్గంలో నడుస్తుంది అనడం అతిశయోక్తి కాదు.

మరికొంతమంది నోములు, వ్రతాలు, తీర్థయాత్రలు అంటూ కాలక్షేపం చేస్తారు. తమ చదువులకి, విజ్ఞానానికి, పిల్లల భవిష్యత్తుకు, ఆట పాటలకు తగిన ప్రాధాన్యత కల్పించరు. దానివల్ల కలిగే నష్టాన్ని గురించి, ధన వ్యయాన్ని గురించి ఆలోచించరు. ఎవరి అభిరుచులు వారివి అయినా నాగరికతా ప్రపం చంలో అవి ఎంతవరకు పరిమితమో ఆలోచించరు.

ఇక కొంతమంది తమకే పిల్లలు ఉన్నట్లు, ఇంకెవ్వరికి లేనట్లు కాలం సరి పెట్టుకుంటారు. ఎన్నేళ్లు వచ్చినా వాళ్ళ పిల్లలు చిన్నపిల్లలే. వాళ్ళు చిన్నవారే! పైగా తమ పిల్లలను ఎవరితోను కలవనివ్వరు. స్నేహితులను కలుసుకుంటే చెడి పోతారని వారి భయం. పిల్లలను ఆడుకోనివ్వరు. దానివల్ల పిల్లలలో ఉత్సా హము చురుకుదనము తగ్గిపోతుందని వారికి తెలియదు. పాతబడిన అంతఃపురాల్లా కూలిపోతున్న అంతస్తులను అడ్డుగోడలుగ నిలుపుకుంటారు. చెలిమివల్ల చిగు రించే కొత్తదనం ఆ పిల్లలకు తీరనిలోటని ఆ పెద్దవారికి తెలియదు ఏ వయ సుకు తగిన శ్రమ ఆ వయసుకు లేక వారి దేహాలు తగిన ఆరోగ్యానికి దూర మవుతాయి. ఎవరైన ఇంటికి వచ్చినవారు వారికేదైన సలహా యిస్తే వారిమీద విరుచుకుపడతారు. పిల్లలు భావిపౌరులు. వారిని ఒక సక్రమ మార్గంలో తీర్చి దిద్దేది తల్లేకదా! వారిని ధీమంతులుగా తయారుచేయవలసిన బాధ్యత తల్లిమీదే ఉంది. శివాజీని కన్న జిజియా మాతను మనము మరువజాలంకదా!

కొంతమంది స్త్రీలు ఎప్పుడూ మూలుగుతూ రోగంతో బాధపడుతున్నట్లుగ ఉంటారు. ఏ విషయాన్నైన ఎక్కువగా ఆలోచించి లేని పోనివి కల్పించుకొని

బాధపడుతు మంచం పడతారు. తమకీ ఆ వ్యాధి ఉన్నట్లుగా భావించి అది కూడా గొప్పగా భావిస్తారు. శరీరానికి తగిన శ్రమ, శ్రమకు తగిన ఆహారం ఉన్నప్పుడే శరీరం, మనసు స్వాధీనంలో ఉంటాయి. కొంతమంది ఏ పని చేస్తే ఏమవుతోందనని, ఏమితింటే ఏ రోగం వస్తుందోనని భయపడుతూ వుంటారు. ఆ భయం వల్ల కలిగే లాభం ఏమీ ఉండదు సరికదా ఏదీ నిర్ణయించుకోలేక ఏ పని సాధించలేకపోతారు.

ఇంకా కొంతమంది తీరిక చేసుకుని వారపత్రికలు, నవలలు, సినీమా పత్రికలు చదువుతూ వుంటారు. ఇంట్లో వీలు చిక్కితే చాలు పుస్తకం పట్టుకు కూచుంటారు ఆ స్థితిలో వారికి దేనిమీద అభిరుచి ఉండదు. ఏ పనిమీద శ్రద్ధ ఉండదు. పిల్లలు ఆకలని ఏడ్చినా చావగొడతారు. వంట మాడ్చివేస్తూ ఉంటారు. చదువుకోడం మంచిదే కాని, పనికిరాని పుస్తకాలు చదవడం వారిని మరింత దిగజారుస్తుంది.

కొంతమంది పురుషులతో పోటీపడి పేకాడడం మొదలైనవి చేస్తూ ఉంటారు పురుషులలో దురభ్యాసంగా ఉన్న ఆ అలవాటును పిల్లలకు సంక్రమించకుండా కాపాడ్డానికి బదులు దానికి రెచ్చగొడితే కలిగే నష్టాలు ఇంతితన రానివికదా!

స్త్రీలు ఈ విధమైన వ్యర్థ కాలక్షేపం మానివేసి, ఉపయోగకరమైన పనులు చేస్తే ఎంత బాగుంటుందో చెప్పండి. ఎన్ని గృహాలు మరింత కలకలలాడతాయి చెప్పండి.

ఇంటి బాధ్యత స్త్రీలదేనా పురుషునకు సంబంధం లేదా? అని ఎవరైన అడగవచ్చు. ఇంటి బాధ్యత ఇద్దరిదీని. పురుషుడు అర్థ నారీశ్వరుడు. భార్యలో సగం పురుషుడు అది కాదని ఎవరు అనలేరు. పురుషుడు కూడా ఇంటి పనులలో బాధ్యత స్వీకరించాలి. దువ్వూరు రామిరెడ్డిగారు 'కృషీవలుడు'లో ఈ మాట ఎప్పుడో చెప్పారు. స్త్రీ పురుషులు తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించిన నాడే రెండు చక్రాలు సమంగా నడిచే రథంలా సాగిపోయింది. స్త్రీలు ఉద్యోగాలు చేయ్యకుండా ఇంట్లో ఉన్నవారు అంతకంటే మంచి పనులు ఎన్నో చెయ్యవచ్చు. పిల్లల పెంపకంలో తగిన శ్రద్ధ చూపడం, విద్యాబుద్ధులు నేర్పడం చాలా అవసరం. ఎంతోమంది పిల్లలు ట్యూషన్లలో కొట్టుమిట్టాడుతున్నారు. చదువుకున్న తల్లి ఆ బాధ్యత తీసుకోవచ్చు. మిషను కుట్టడం, తోటపని చెయ్యడం మొదలైన పనులు చేయ్యవచ్చు.

మంచి గ్రంథ పఠనం చేసి ఎన్నో విషయాలు నేర్చుకోవచ్చు సంఘ సేవ చెయవచ్చు. రాజకీయ రంగాన్ని తగినవిధంగా అర్థం చేసుకుని ముందుకు రావచ్చు. స్త్రీ ముందుకు వచ్చి మరింత చైతన్యాన్ని పుంజుకోవచ్చు. సమాజాన్ని చైతన్యవంతం చెయవచ్చు.

—0—

# ఇవి ఒక పరిష్కారం మాత్రమే!

ప్రొద్దుటే పేపరు చదువుతున్న శ్యామల ఆ వార్త చదువుతూనే నిలువెల్లా వణికిపోయింది. గుండెను ఎవరో బలవంతంగా నొక్కినట్లయింది.

'అమ్మా' అంటూ ఒక వెర్రికేక పెట్టి కుర్చీలో వాలిపోయింది శ్యామల.

'ఏమయింది శ్యామా' ఆ కేక విన్న తల్లి వంటింట్లోంచి పరుగెత్తుకుంటూ వచ్చింది

చేతిలో పేపరుతో కుర్చీలో వాలిపోయిన కూతుర్ని చూసి ఆవిడ కంగారు పడింది.

'ఏం జరిగిందే' అంటూ కూతురు భుజాలు పట్టుకుని కుదిపింది.

కాస్త తెప్పరిల్లిన శ్యామల తల్లికి నోటితో చెప్పలేక పేపరు అందించింది.

'అందులో ఏముందే' అంటూనే ఆవిడ కూతురు చేతిలో పేపరు అందుకొని చూసింది.

'పెద్ద పెద్ద అక్షరాలతో రాసిన ఆ వార్త చదివి ఆవిడ మరింత ఆశ్చర్య పోయింది.

'అదెలా జరిగిందమ్మా! అలా ఎలా చనిపోయింది' అంటూ ఉబికి వస్తున్న కన్నీళ్లు తుడుచుకుంది ఆ తల్లి.

అంతవరకు ఆపుచేసుకున్న శ్యామల దుఃఖం పెల్లుబికి వచ్చింది. తనతో కాలేజీలో చదువుకుంటున్న రాధ మరణాన్ని ఆమె నమ్మలేకపోయింది. నిన్న తనతో అంత చనువుగా ఉన్న రాధ ఈనాడు లేదు. అనుకోగానే శ్యామల నిలవలేక పోయింది. రోజూ పేపర్లో ఎందరో స్త్రీల అత్యాచారాలు చదువుతూనే ఉంది. వింటూనే ఉంది. కాని ఏనాడు ఏడుపు రాలేదు. కానీ ఈనాడు కళ్ళు ఎడతెరపిలేక వర్షిస్తున్నాయి.

తలచుకున్న కొదీ ఆమెలో దుఃఖం స్థానములో కోపం ఆక్రమించుకుంది.

'ఇది అసంభవం. ఆమె ఆత్మహత్య చేసుకుని ఉండదమ్మా! రాధ అమాయకురాలు ఆమెను చంపేసి ఉంటారమ్మా' ఆవేశంగా అంది శ్యామల.

'ఎంత రాక్షసులైన కట్నకానుకల కోసం తిడతారు. సాధిస్తారు. కాని చంపుతారా శ్యామలా'

'వాళ్ళే చంపేసి ఉంటారమ్మా! ఆమె చనిపోయినా వాళ్ళు చంపినా ఒక్కటే! వాళ్ళని పోలీసులకి పట్టించాలి.' శ్యామల కుర్చీలోంచి లేచింది.

'కాఫీతాగి వెళ్ళవే' అన్న తల్లి మాటలు వినిపించుకోకుండానే రాధ ఇంటి వేపు నడిచింది శ్యామల.

రాధ తల్లి నేలమీపడి గోడుగోడున ఏడుస్తుంది. అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు తల్లిచుట్టూ చేరి ఏడుస్తున్నారు.

వాళ్ళని చూస్తున్న జనం కళ్ళు తుడుచుకుంటూనే ఉన్నారు.

తల్లిదండ్రులు చూడకుండానే దహనసంస్కారాలు పూర్తి చేయలను కున్నారు.

రాధ తండ్రి కోపంతో పోలీసులకు కంప్లెయింట్ చేసాడు.

రాధకు సంబంధించిన విషయాలు ఎన్నో బయటపడుతున్నాయి. అత్తగారు భర్త, మరిది కలిసి చంపేసి ఆత్మహత్య చేసుకుందని నమ్మించాలని ఫ్యాన్‌కి ఉరేసుకున్నట్లుగా ఆమె శవాన్ని తగిలించారట.

రాధ అత్తవారింటికి పక్కింటిలో ఉన్న వాళ్ళు రోజూ రాధను పెట్టేబాధలు చెబుతుంటే వినలేకపోయింది శ్యామల.

అంత స్నేహంగా ఉన్న తనతో ఒక్కమాట కూడా చెప్పనందుకు చాలా బాధపడింది శ్యామల.

రాధ గుట్టువిడిచి ఎదుటివారితో ఆ బాధలు చెప్పుకుంటే ఆమెను చనిపో నిచ్చేవారుకాదు. ఆమెను ఓదార్చి ఏదో మార్గం చెప్పేవారు. శ్యామల మనస్సు బాధతో మూల్గింది.

'స్త్రీకి సంసార విషయంలో గుట్టు అవసరం అన్నారు పెద్దలు. కాని ఆ గుట్టే ఈనాడు స్త్రీని నాశనం చేస్తుంది' అనుకుంది శ్యామల ఆమె మనస్సు మన స్సులో లేదు. అక్కడకు వచ్చిన మిగిలిన కాలేజీ పిల్లలతో కలిసి కాలేజీవేపు నడి చింది శ్యామల ఆ రోజు కాలేజీకి శలవు ఇచ్చారు. అందరు కలిసి పెద్ద ఊరే గింపు జరిపారు.

గవర్నరుగారికి, ప్రభుత్వానికి వినతిపత్రాలు సమర్పించారు.

పోలీసులు వచ్చి భర్తను, మరదిని అత్తగారిని అరెస్టుచేసి తీసుకువెళ్ళారు.

కాస్త కుదుటపడిన మనస్సుతో ఇల్లు చేరింది శ్యామల. నీరసంగా మంచంమీద వాలిన శ్యామల రాధ సంగతే ఆలోచిస్తుంది.

ఆ కూతుర్ని చూసిన తల్లి మనసు మరింత బాధపడింది.

'జరిగిందానికి బాధపడితే ఏం లాభం. కాస్త ఎంగిలివడు శ్యామలా' తల్లి ఎంతో ప్రేమతో అడిగింది.

'పాపాత్ముల్ని పట్టుకున్నారమ్మా! ఇంక వదలరు వాళ్ళని. అందరికి శిక్షలు పడతాయి' అంది శ్యామల ఆవేశంతో.

ఆమెవేపు తల్లి ఆశ్చర్యంగా చూసింది.

అమ్మా రాధ ఎవరిమూలంగా చచ్చిపోయిందంటావు' తిరిగి శ్యామలే అడిగింది.

'ఆదేమిటే అలా అడుగుతావు? అత్త, మొగుడు, మరిది కలిసే చంపారని అంటున్నావుగా'

'అందులో తల్లిదండ్రుల బాధ్యత, సమాజం బాధ్యతా లేదంటావా?'

కూతురు ప్రశ్నకు తల్లి నోరు తెరిచింది

'అత్త సాధిస్తుందని, భర్త తిడుతున్నాడని పుట్టింటికి వస్తే తలిదండ్రులు ఇంటికి పరువు నష్టమని, చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు కావని భయపడి ఆమెను తిరిది పంపించేస్తారు. సమాజం అంతకంటె కాల్చుకుతింటుంది. చచ్చిపోకుండా ఎలా ఉంటుందమ్మా! ఈ మధ్యతరగతి కుటుంబాల్లో ముందు లేనిపోని గొప్పలు నశించాలమ్మా! గుట్టు పోవాలి. అప్పుడుకాని ఆడపిల్లలు జీవితాలు బాగుపడవు.' ఆవేశంగా చెబుతున్నా కూతురు పలికే మాటల్లోని యదార్థాన్ని కాదనలేకపోయింది ఆ తల్లి.

'నువ్వు చెప్పేది నిజమే అనిపిస్తుందే' అంది ఆవిడ.

'అందుకే తన కాళ్ళమీద తాను నిలబడితే కాని పెళ్లి చేసుకోకూడదనుకుంటున్నానమ్మా' అంది నిశ్చయంగా శ్యామల.

'ఆదేమిటే పెళ్ళి కుదిరాక చేసుకోనంటే ఏం బాగుంటుందే' అందావిడ.

'బాగో కాదో నాకు తెలియదమ్మా! రేపు నాకు కూడా అవే బాధలు

రావచ్చు. నువ్వు నాన్న అలాగే అనచ్చు. అందుకే నేను ఇప్పట్లో పెళ్లి చేసుకో నమ్మా! ప్రతీ పిల్లకు ఈ జ్ఞానోదయం కలిగేవరకు ప్రయత్నం చేస్తాను.'

కూతురు చెప్పినదాన్ని కాదనలేదు ఆ తల్లి.

'ఇది ఒక పరిష్కారం మాత్రమేనమ్మా. చనిపోయిన తర్వాత చేసే ఊరేగింపులు ముందు జరిపి ఆడవారు చనిపోకుండా చూడలమ్మా' శ్యామల కంఠం గాంభీర్యంగా పలికింది.

—o—

# ఈ సమస్యకు ఇదే పరిష్కారం

''శ్యామలా విన్నావా?'' సరిత సుడిగాలిలా ఇంట్లో అడుగు పెట్టింది.

'ఏమిటే హడావిడి' సరితను ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది శ్యామల.

'లతకు సీరియస్‌గా ఉంది. హాస్పటల్‌కి వెళ్ళాలి లే'' కూర్చున్న శ్యామలను రెండు చేతులతోను లేవదీసింది సరిత!

'ఏమయ్యింది?' శ్యామల కంఠం వణికింది.

'రాత్రి నిద్రమాత్రలు మింగిందిట' సరిత కళ్ళలో నీళ్లు తిరిగాయి. అంత వరకు బలవంతంగా ఆపుకున్న దుఃఖం పొంగి వచ్చింది.

ఆమె చేతుల్లో శ్యామల బావురుమంది.

ఆ ఇద్దర్నీ చూసి శ్యామల తల్లి ఆశ్చర్యపోయింది.

'మళ్ళీ ఏమయిందే?'

'లత చావు బ్రతుకుల్లో ఉంది.' వెక్కిళ్ళమధ్య సమాధానమిచ్చింది శ్యామల తల్లికి.

ఆవిడకు మరి నోటమాటరాలేదు.

ఆ ఇద్దరు హాస్పటల్‌కు బయలుదేరారు.

చావు బ్రతుకుల్లో కొట్టుమిట్టాడుతోంది ఆమె ప్రాణం.

లతను చూడలేకపోయారు.

లత భర్త పెద్ద ఉద్యోగస్థుడే. లత బియ్యే పాసయింది. పెళ్ళికిముందు ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం చేసేది. పెళ్ళి అయ్యాక ఉద్యోగం మానిపించేసారు.

ఇంట్లో పొద్దుట లేచింది మొదలు రాత్రి పడుకోబోయేవరకు చాకిరియే పాపం। నోరెత్తకుండా చేస్తూనే ఉంటుంది. కాని ఆమెమీద ఎవరికి సానుభూతి ఉండేదికాదు. ప్రొద్దున కాఫీతాగిన, మనిషి అందరికి పెట్టి తాను భోజనం చేసే టప్పటికి రెండు మూడు అయ్యేది. మనిషి చిక్కి శల్యమయింది.

ఎంతబాగా వంటచేసినా ఎవరూ మెచ్చేవారు కాదు. అత్త సాధిస్తూనేఉంది. భర్త మాట్లాడే వాడుకాదు.

ఆడపిల్లలు వస్తే లతకు మరింత నరకంగా ఉండేది. మంచినీళ్ళ దగ్గర నుంచి అన్నీ అందించాలి. ఆ నరకం భరించలేక ఒకసారి పుట్టింటికి వెళ్ళిపోయింది పెద్దలంతా కలిసి తిరిగి అత్తవారింటికి పంపించారు.

"నాన్నా! నేను ఉద్యోగం చేసుకొని బతుకుతాను. నన్ను ఆ నరకానికి పంపించకండి నాన్నా" అంటూ తండ్రి కాళ్ళ తల్లి కాళ్ళు పట్టుకుని ఏడ్చింది.

'పెళ్ళికాని వాళ్ళనే పోషించలేకపోతున్న అసమర్థుణ్ని పెళ్ళిఅయిన నిన్ను కూడా ఎక్కడ పోషించనమ్మా। అన్నాడు ఆ తండ్రి.

నువ్వు ఇక్కడ ఉంటే లోకులు కాకుల్లా పొడుచుకు తింటారమ్మా పెళ్ళి అయిన పిల్ల అత్తవారింట్లో ఉంటేనే ధర్మం. ఎవరు ఎక్కడ ఉండాలో అక్కడ ఉంటేనే మంచిది." అందట ఆ తల్లి.

లత సినిమాలు, సరదాలు అన్నీ మరిచిపోయింది. ఏ పుస్తకం చదవకూడదు ఏ స్నేహితురాలింటికీ వెళ్ళకూడదు. ఈ బాధలు భరించలేని లత ఆత్మహత్యకు పూనుకుంది.

ఈ విషయాలు విన్న సరిత, శ్యామల మరింత బాధపడ్డారు.

పెళ్ళి అయిన తర్వాత లత వీరిని ఒక రెండుసార్లు కలిసింది. మనిషి బాగా చిక్కి నీరసంగా కనబడింది. ఏమడిగినా చెప్పదు. ఇన్ని బాధల్ని ఎలా భరించిందో।

* * *

ఇద్దరూ లతకు దగ్గరగా వెళ్లారు.

లత కళ్ళు విప్పి చూసింది. ఆమె కళ్ళలో చెప్పలేని వేదన లత తన చేతిని శ్యామల చేతిలో ఉంచింది. ఏదో చెప్పాలని పెదిమలు కదిపింది. కానీ చెప్పలేక పోయింది ఆమె ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

శ్యామల, సరిత కొయ్యబారి పోయారు.

ఆమె ఆత్మహత్య చేసుకుందని దానికి కారణం అత్తవారేనని అందరికీ తెలుసు. లత మరణించిన తర్వాత జనం లత అత్తవారిని తిట్టారు,

లత బతికిరాదని తెలుసు అందరికి. అయినా ఆ బాధ అటువంటిది.

శ్యామల' సరిత ఇంక అక్కడ ఉండలేకపోయారు.

ఇంట్లో అడుగుపెడుతున్న శ్యామల్ని జాలిగా చూసింది తల్లి.

'ఏం, అమ్మా! ఏం జరిగింది' ఉండబట్టలేక అడిగింది ఆ తల్లి.

'ఏం జరుగుతుందమ్మా' ఈసారి కట్నం కానుకలకోసం కాదు, దానిసలా ఇంట్లో చాకిరి చేయించి చంపేసారమ్మా.

అదేమిటే ఆత్మహత్య అంటున్నావు కదా!

'ఆమె మందు మింగింది నిజమే. ఆ మందు మింగడానికి వీళ్ళందరూ కారకులమ్మా. వీరివల్లనే చనిపోయింది. వాళ్ళే చంపేసారు. ఇకపై రెండేళ్ళు కూడా నిండని లత ఎందుకు చనిపోతుందమ్మా!'

ఈ రోజు లత-రేపు గీత ఎల్లుండి మరొకరు. ఒకరు కట్నకానుకలకు వేరొకరు చాకిరికి. ఏదైనా పిల్లలకు పెళ్ళిళ్ళు చేసి అత్తవారింటికి బలిచేస్తున్నారమ్మా! వీరిలా చనిపోవాల్సిందేనా? కాదు, యువతులు ధైర్యాన్ని తెచ్చుకోవాలి. అలాంటి క్లిష్టపరిస్థితి వస్తే భర్తను, అత్తమామలను, సమాజాన్ని ఎదిరించి నిలబడగలశక్తి సంపాదించుకోవాలి. తన జీవితాన్ని తాను దిద్దుకోగల శక్తి పెంపొందించుకోవాలి. అప్పుడుకాని ఈ చావులు ఆగవు. వారిని వారే రక్షించుకోవాలి. ఈ సమస్యకు ఇదో పరిష్కారం. నేటినుండి నే పనిచేస్తాను.

ఆవేశంగా అంటున్న కూతురు మాటలు విన్న ఆ తల్లి నిజం అలాగే జరగాలి అంది.



# చదువుకున్న కోడలు

పిన్నీ మీ అబ్బాయికి పెళ్ళి చెయ్యవా ఏమిటి?' పక్కింటి సీతారావమ్మ అడిగింది.

'ఏం మునిగి పోయిందని? అందరికీ వాడి పెళ్ళిమీదే పడింది దృష్టి?" పార్వతమ్మ విసురుగా అడిగింది.

బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా పనికిరావంటారు? అందు కని లేకపోతేమీ మీ అబ్బాయి పెళ్ళితో నాకేంపని!" అంది సీతారావమ్మ.

'పెళ్ళి చెయ్యడమంటే మాటలా! బాగా చదువుకున్నపిల్ల దొరకొద్దూ!'

'నువ్వు ఊ అను. కోటి మందిని తీసుకు వస్తాను. ఈ రోజులలో ఆడపిల్లల కేం భాగ్యం' అంది సీతారావమ్మ.

'బాగా చదువుకున్న పిల్ల కుందనపు బొమ్మలా ఉన్న పిల్ల కావాలి? ఎవరేనా నీ దృష్టిలో ఉంటే చెప్పరాదూ' అంది పార్వతమ్మ.

'ఇంతకీ మీ అబ్బాయి ఏం చేస్తున్నాడు' అడిగింది సీతారావమ్మ.

'నీకు తెలియదా ఏమిటి? బి.ఏ పాసై సెక్రటేరియట్‌లో గుమాస్తా చేస్తు న్నాడు'. గొప్పగా చెప్పింది పార్వతమ్మ.

'ఈ రోజుల్లో ఉద్యోగం దొరకడమే కష్టం మీ అబ్బాయికి బాగానే దొరి కింది. నా మతిమరుపు మునిగిపోను. చెప్పడమే మరిచిపోయాను. మా పక్కింటి వాళ్ళ అమ్మాయి బి.ఎ. చదువుతోంది. చక్కగా ఉంటుంది. మీ అబ్బాయికి ఆమెకు ఈడు జోడు బాగుంటుంది.'

'అలాగా సీతారావమ్మా! చెప్పవేం మరి. వాళ్ళతో మాట్లాడి పెళ్ళిచూపులు ఏర్పాటు చేయించు. ఈ పెళ్ళి కుదిర్చి పుణ్యం కట్టుకో' అంది బతిమాలే ధోరణిలో

'దానికేం పిన్నీ తప్పకుండా మాట్లాడుతాను' అంటూ బయలుదేరింది సీతా రావమ్మ.

మరోసారి హెచ్చరించింది పార్వతమ్మ. సీతారావమ్మ వెంటనే వాళ్ళతో మాట్లాడింది.

ఎక్కడా పెళ్ళికొడుకు కనపడని ఈ రోజుల్లో గవర్నమెంటు ఉద్యోగం ఉన్న పెళ్ళికొడుకు కనపడేటప్పటికి వాళ్ళకి పెన్నిధి దొరికినంత సంతోషం కలిగింది. వెంటనే పార్వతమ్మతో భర్తతోమాట్లాడి పెళ్ళిచూపులు ఏర్పాటు చేయించారు

పార్వతమ్మ, కొడుకు వచ్చి చూసుకున్నారు. పిల్ల మరీ అందగత్తె కాకపోయినా బాగానే ఉంది. కట్నం అడగకుండానే పార్వతమ్మకు కావలసినవన్నీ ఇస్తామన్నారు,

పార్వతమ్మ మురిసి పోయింది. వెంటనే ముహూర్తాలు పెట్టించి పెళ్ళి ఏర్పాట్లు చేయించింది. పార్వతమ్మ కనపడ్డ వాళ్ళందరికి మా కోడలు బి.ఏ. చదువుతోందని చెబుతోంది. ఆఖరికి పెళ్ళిపీటలమీద కూడ బాండు మేళం మధ్యలో కూడా గొంతు హెచ్చించి ఆ విషయం అందరితో చాటిస్తూనే ఉంది. ఏమీ చదువుకోని బావగారి కోడలు ముఖం పక్కింటివారి కోడలు ముఖం కాస్త వెలవెల పోతున్నాయి.

'ఆ! ఈ ముచ్చట ఎన్నాళ్ళో అమ్మా! చూద్దాంగా" అంది తోడికోడలు పక్కింటి ఆవిడతో.

కోడలు కాపురానికి వచ్చినరోజు 'అందరి కళ్ళు నీమీదే ఉన్నాయమ్మా!' అంటూ ఇంత మిరపకాయలు దిష్టితీసి పోసింది పార్వతమ్మ.

"కోమలా'' అంటూ కోడల్ని పేరు పెట్టి పిలుచుకుంటూ మురిసిపోతోంది. పార్వతమ్మ ఓ మూడురోజులు కోమల ఆలస్యంగా లేచినా ఆవిడ సరిపెట్టుకుని ఉత్సాహంగా అన్నిపనులూ చేసింది. నాలుగోరోజు నుంచి ఇంటి పనుల్లో చేదోడు వాదోడుగా ఉండక పోతుందా అనుకుంది పార్వతమ్మ.

నాలుగోరోజు కోమల పుస్తకాల్ని సంచి భుజాన వేసుకుని పడకగదిలోంచి బయటకు వచ్చింది. అత్తగారు అడక్కుండానే.

'అత్తయ్య పరీక్షలు దగ్గరకు వస్తున్నాయికదా, కాలేజీకి వెళ్ళాలి' అంటూ అత్తగారు టేబులుమీద రెడిగాఉంచిన భోజనం పెట్టుకుతిని ఎంగిలిప్లేటు కూడా వదిలి కాలేజీకి వెళ్ళి పోయింది.

'రెండు నెలలేకదా! పాపం! చదువంటే మాటాలా' అనుకున్న పార్వతమ్మ కోడలికి అన్నీ అమర్చి పెట్టింది.

పరీక్షలు పూర్తి కాగానే అంతపని అప్పచెప్పి పార్వతమ్మ విశ్రాంతి తీసుకోవాలనుకుంది. ఆ రోజు ఇంటికి రాగానే అత్తయ్యా మా ఫ్రెండ్సుతో సినిమాకు వెడుతున్నా' అత్తగారి సమాధానం వినకుండానే కోమల సినిమాకు వెళ్ళిపోయింది

పార్వతమ్మకు నిజంగానే ఒళ్లు మండిపోయింది. సినిమానించి రాగానే కొడుకుతో చెప్పి ఆట కట్టించాలనుకుంది.

అంతలో తోటికోడలు, పక్కింటావిడవచ్చి 'ఏం పార్వతమ్మా! పాపం మీ కోడలు ఇక్కడి చెంబు అక్కడ పెట్టదుటగా! పాపం ఎలా చేసుకుంటున్నావో ఏమో! మా కోడలు చూడు ఇంటెడు పని వాళ్ళే చేసుకుంటారు.' అంటూ మొదలు పెట్టారు.

పార్వతమ్మకి కళ్ళలో నీళ్లు తిరిగాయి. అయినా సద్దుకుని 'మా కోడలు ఇలాంటి పనులు చెయ్యదు. పెద్ద ఉద్యోగం చేస్తుంది. వాళ్ళు వెళ్లిపోయినా బాధపడుతూనే ఉంది. కోడలికి పనులుమాత్రం చెప్పలేకపోయింది. కోడలు ఉద్యోగంలో చేరింది.' అత్తయ్యా! ఈ చీర మీ కోసం కొన్నాను. ఇదిగో ఇది గ్రైండరు పచ్చళ్ళన్నీ ఇందులోనే చేసుకోవచ్చు నా మొదటి నెలజీతం మీ కోసమే ఖర్చు పెట్టాలనుకున్నాను' అంటూ అత్తకు అందించింది కోమలి. పార్వతమ్మ సంతోషానికి అంతులేదు, వెంటనే తోడికోడలుతో, పక్కింటావిడకి చూపించి' ఎంతైనా మా కోడలు చదువుకుంది కదా!' గర్వంగా చెప్పుకుంది.

—O—

# ఉద్యోగమున్న అమ్మాయినే పెళ్ళి చేసుకుంటే

శ్రీరామ్ ఉద్యోగంలో ఉన్న అమ్మాయినే పెళ్లి చేసుకోవాలనుకున్నాడు. ఈ రోజుల్లో ఒక సంపాదనలో సౌకర్యంగా బతకడంకష్టమనుకున్నాడు. ఉద్యోగం చేస్తున్న ఎంతో మంది అమ్మాయిల్ని చూసివచ్చాడు. పిల్ల నచ్చితే ఉద్యోగం లేదు. ఉద్యోగం ఉంటే పిల్ల నచ్చలేదు. అతని స్నేహితులు కూడా అతనికోసం ప్రయత్నాలు ప్రారంభించారు. చివరకు బ్యాంకులో పనిచేస్తున్న ఒక అందమైన అమ్మాయి గురించి స్నేహితులు చెప్పారు. మధ్య వర్తుల ద్వారా పెళ్లిచూపులు ఏర్పాటయ్యాయి. అంత అందమైన అమ్మాయి తనకు దొరకడం అందులో ఉద్యోగంలో ఉండడం తన అదృష్టమన్నాడు శ్రీరామ్.

ప్లేటులో ఉన్న కాజాలు తింటూ అమ్మాయిపైపే చూస్తున్నాడు శ్రీరామ్.

కాస్త తల అటు ఇటు తిప్పరా బాబూ స్నేహితులు చెబుతున్న ఆ అమ్మాయి నుంచి శ్రీరామ్ చూపులు మరల్చుకోలేకపోయాడు.

'మీరు ఎన్నాళ్ళనుంచి ఉద్యోగం చేస్తున్నారు' అడిగాడు శ్రీరామ్.

'మూడేళ్ళనుంచి' సమాధానమిచ్చింది సుకన్య.

'పెళ్ళయినతర్వాత ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నారా' శ్రీరామ్ స్నేహితుడు అడిగాడు.

'పెళ్ళయినతర్వాత ఉద్యోగం చెయ్యాలని అనుకోవడంలేదు' నవ్వుతూ సమాధానమిచ్చింది.

'మీరు అన్నివిధాల మా శ్రీరామ్‌కి నచ్చారు. మీరు ఉద్యోగం చేస్తానంటే మిమ్మల్నే పెళ్లి చేసుకుంటాడు' స్నేహితుడే అడిగాడు.

'మీ ఫ్రెండ్‌కు నచ్చితే నాకూ నచ్చాలి కదండి. అయినా ఉద్యోగం భార్య చేత చేయించాలి అనుకునే వ్యక్తిని నేను పెళ్ళి చేసుకోకూడదని నిశ్చయించుకున్నాను. సారీ' అంటూ సుకన్య మెరుపుతీగలా లోపలికి వెళ్లిపోయింది.

ఆడపిల్లలకు కూడా అభిప్రాయాలు ఉంటాయని ఊహించుకోని శ్రీరామ్ ముఖం వాడిపోయింది.

'దిగులుపడకు శ్రీరామ్. ఇదొకందుకు మంచిదే అమ్మాయి అభిప్రాయం కూడా మనం తెలుసుకోవాలికదా! పైగా పెళ్లి చేసుకున్నాక నేను ఉద్యోగం

చెయ్యనని మొరాయిస్తే చాలా కష్టమయ్యేది. ఏం బాధపడకు అన్నారు. ఈసారి శ్రీరామ్ మరీ అందమైన అమ్మాయి అక్కరలేదు కానీ ఉద్యోగంచేస్తూ సామాన్యంగా ఉంటే చాలన్నాడు.

కంపెనీలో పనిచేస్తున్న మరో అమ్మాయితో పెళ్లి చూపులు ఏర్పాటు చేశారు.

శ్రీరామ్ కంటికి ఆ అమ్మాయి కూడా బాగానే కనబడింది.

'మీరు పెళ్ళయినా కూడా ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నారా? అడిగాడు శ్రీరామ్ ఫ్రెండ్.

'ఆ ఇంటి పరిస్థితులనుబట్టి అవసరమో కాదో చెప్పగలను. ఇప్పుడే ఏం చెబుతానండీ అయినా మీ ఫ్రెండు ఉద్యోగం చేయించాలనుకున్నా ఆ అమ్మాయికి ఏం సౌకర్యాలు ఏర్పాటు చేయిస్తారు' తిరిగి ప్రశ్నించింది రమామణి.

శ్రీరామ్ తెల్లబోయి స్నేహితులవైపు చూశాడు వాళ్ళు శ్రీరామ్‌వైపు చూశారు.

అంటే మీ ఉద్దేశం వివరంగా చెప్పండి శ్రీరామ్ స్నేహితుని మాటలు తడబడ్డాయి,

'ఆఫీసుకి త్వరగా వెళ్ళడానికి స్కూటర్, కుక్కర్, గ్యాస్‌స్టౌ వగైరా లేకుండా అవసరమైతే వంటమనిషిని ఏర్పాటు చెయ్యాలి అంతేకాదండీ భర్త కూడా భార్యతో సమానంగా పనిచెయ్యడం అవిడకు చేదోడు వాదోడుగా ఉండడం నిర్మొహమాటంగా చెప్పింది రమామణి.

'అవన్నీ మా శ్రీరామ్ కొనగలడండీ. కాని ఇంట్లో పని చెయ్యడం అలవాటులేదండీ.

'పోనీ వంట చెయ్యడం వచ్చాండీ?'

'అదెందుకండీ'

'నేను ఉద్యోగం చేస్తున్నాకదండీ! అందుకే వంట చెయ్యడం నేర్చుకోలేదు నాకు ఇంట్లో పనిచెయ్యడం అలవాటులేదు కదండీ'

'వంట చెయ్యడం స్త్రీ లక్షణం కాదండీ'? శ్రీరామ్ స్నేహితుడు నసుగుతూ నసుగుతూ అన్నాడు.

'ఉద్యోగం పురుషలక్షణం కాదండీ' ఆమె మాటల్లో వెటకారం ధ్వనించింది.

మరోసారి శ్రీరామ్ ముఖం వాడిపోయింది. స్నేహితులతో కలిసి ఇంటి ముఖం పట్టాడు. ఈ పెళ్ళి చూపులు బాగుండలేదనుకున్నాడు. తనకు నచ్చిన అమ్మాయిని కాదు తనను మెచ్చుకున్న అమ్మాయినే పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. ఆ అమ్మాయి అడిగిన సామానులన్నీ కొనడం మొదలుపెట్టాడు. హోటలు భోజనం మానేసి ఇంట్లో వండుకోడం ప్రారంభించాడు.

రమామణి నిర్మొహమాటంగా మాట్లాడడంవల్ల ఆ అమ్మాయిని పెళ్లి చేసుకోడానికి ధైర్యంగా ఎవరూ ముందుకు రాలేదు. అందుకే ఆమె అభిప్రాయాలు మార్చుకుంది.

శ్రీరామ్‌కి మరో అమ్మాయిని చూసే ధైర్యం లేక ఆలోచిస్తూ ఉండిపోయాడు.

శ్రీరామ్ ఓరోజు అజంతా హోటల్‌కి కాఫీ తాగుదామని వెళ్ళాడు. రమామణి కూడా అదే హోటల్‌కి వెళ్ళింది. శ్రీరామ్‌ని చూసి గుర్తుపట్టి నవ్వింది. అతను కూడా గుర్తుపట్టి నవ్వాడు. ఇద్దరూ కలసి ఫామిలీ రూముకి వెళ్ళి కూర్చున్నారు.

'టిఫిన్ ఏం తీసుకుంటారండీ అడిగాడు నవ్వుతూ.

'మీ ఇష్టమండీ' నవ్వుతూ చెప్పింది.

అతనికి వచ్చిన పెరుగువడ ఆర్డరిచ్చాడు. టిఫిన్ తింటూంటే మాటలు కలిశాయి. మిమ్మల్ని పెళ్ళి చూపుల్లో అవమానించాను. మీరింత మంచివారనుకోలేదండీ' అంది రమామణి.

'మీరింత మంచివారనుకోలేదండీ' శ్రీరామ్ చెప్పాడు. ఇద్దరి మనసులూ కలిసాయి. వెంటనే పెళ్ళి ఏర్పాట్లు చేసుకున్నారు. ఇద్దరూ ఆడుతూ పాడుతూ ఉద్యోగం చేస్తూ వెంటనే పెళ్ళి ఏర్పాట్లు చేసుకున్నారు. ఇద్దరూ ఆడుతూ పాడుతూ ఉద్యోగాలు చేస్తూ జీవితం గడుపుతున్నారు. వారినిచూసిన స్నేహితులు మరింత తికమకపడ్డారు.



# కోడలంటే అణిగిమణిగి ఉండాలా!

అత్తవారింటికి బయలుదేరుతున్న రేఖతో తల్లి 'అమ్మాయ్ రేఖా! అత్తింటి కోడలు అణిగిమణిగి ఉండాలి. మంచి పేరు తెచ్చుకోవాలి" అంటూ చెప్పింది.

'అణిగిమణిగి ఉండడం అంటే ఏమిటమ్మా?' ముఖం అమాయకంగా పెట్టి అడిగింది రేఖ.

'అదేమిటే అలా అడుగుతావు! అంత చదువుకున్నావు ఆ మాత్రం తెలీదుటే' తల్లి విసుక్కుంది.

'తెలీకే అడుగుతున్నా! చెప్పమంటే అలా విసుక్కుంటావేమిటి?' ఈసారి రేఖ విసుక్కుంది.

'ఏదో వడ్లగింజలో బియ్యపు గింజ. ఏముంది? ఇంటిగుట్టు అంతే!'

'ఇంటిగుట్టంటే ఏమిటమ్మా!'

'నీతో కష్టమొచ్చి పడింది నాకు ఇంటి గుట్టంటే తెలీదా? అత్తగారి మీదనో, మామగారి మీదనో, భర్త మీదనో ఎవరితోనూ చాడీలు చెప్పకూడదు. పైగా అత్త, ఆడబిడ్డలు, ఏమన్నా ఎదిరించగూడదు. వారు చెప్పిన పనంతా చెయ్యాలి.

'అదేమిటమ్మా! అనవసరంగా అత్తగారు ఏమన్నా ఊరుకోవాలా? తెలిసిన దానికి కూడా సమాధానం ఇవ్వకూడదా! ఇది మరీ ఆశ్చర్యంగా ఉంది. ఇంటి గుట్టంటావా, నేను ఒప్పుకుంటాను. ఈ బానిసత్వం ఒప్పుకోను. అత్తింటికి వెళ్ళడమంటే పౌరుషాన్ని చంపుకొని నగంచచ్చి వెళ్ళాలన్నమాట. ఇది నేను ఒప్పుకోనమ్మా !"

'ఆ వితండవాదన వద్దంటాను. అత్తిల్లు అంటే ఏమిటనుకున్నావు? నేను నా 12 వ ఏట కాపురానికి వచ్చాను...' ఇంకా ఏదో చెప్పబోయేంతలో తల్లి మాటలకు అడ్డు వచ్చింది రేఖ.

'నీ చిన్నతనం సంగతి బాగా తెలుసమ్మా! అత్తగార్లు మాత్రం మారరంటావు నేనే అణిగిమణిగి ఉండాలి. సరే ప్రయత్నం చేస్తా' అంది నిబ్బరంగా.

'జాగ్రత్తమ్మా! అనవసరంగా గొడవలు తెచ్చుకోకు. జరిగింది కొంచెమే అయినా లోకం చిలవలు పలవలుగా చెప్పుకుంటుంది' తల్లి మరోసారి హెచ్చరించింది.

రేఖ అత్తింటికి కాపురానికి వచ్చింది.

అత్తగారు, ఆడబిడ్డలు సూటిపోటిమాటలు (నవ్వుతూ) అంటున్నా పట్టించుకోడం మానేసింది.

ఆరోజు ఎవరో చుట్టాలు వచ్చారు. అత్తగారికి మర్యాదలు చెయ్యడంతోను, వారితో మాట్లాడడంతోను సరిపోయింది. రేఖ వంటింట్లో ఏదో ఒక పని చేస్తూనే ఉంది.

హాల్లో కూర్చున్నవారికి రేఖ టిఫిన్ ప్లేట్లు అందించింది. మంచినీళ్ళ గ్లాసులు పెట్టింది. పొద్దుటి నుంచీ పనితో అలిసిపోయిన రేఖ అలసటను ఎవరూ పట్టించుకో లేదు. రేఖ మనసు చికాకుగా ఉంది, అయినా ఓర్పుతో ఉంది.

'మీ కోడలు మంచి పనిమంతురాలు. ఇలాంటి కోడలు దొరకడం నీ అదృష్టం' వచ్చినావిడ రేఖ అత్తగారిని పొగిడింది.

'నేను కూర్చోమంటే కూర్చుంటుంది. నుంచోమంటే నుంచుంటుంది. కోడలిని అలా గుప్పిట్లో పెట్టుకున్నాను వదినా' అత్తగారు గర్వంగా తల ఎగుర వెయ్యడం కోడలి కంటపడింది. రేఖ మనసు బాధతో మూల్గింది

అప్పటికి రేఖ కాళ్ళు లాగుతున్నాయి. నడుం నెప్పి పుడుతోంది. కళ్ళు తిరిగాయి. మెల్లిగా వెళ్ళి గదిలో మంచంమీద వాలింది.

మర్యాద కోసం లేని ఓపిక తెచ్చుకుని ఇంటెడుపని చేస్తుంటే 'మా కోడలు పనిమంతురాలు, బుద్ధిమంతురాలు. నెమ్మదస్తురాలు' అని అత్తగారు అంటుందను కున్న రేఖ ఈ మాటలు వినలేకపోయింది. అయినా అనవసరంగా నోరు పారేసు కోకూడదు అనుకుంది, అలసిన శరీరానికి మంచంమీద వాలగానే కునుకుపట్టింది చుట్టాలు వెళ్ళిపోగానే అత్తగారి దృష్టి రేఖమీద పడింది.

'వేళాపాళా లేకుండా ఏమిటా నిద్ర. అడిగేవాళ్ల లేరు. సాయంకాలం వంట టైం దాటిపోతోంది. నీ బాబు పంపించిన నౌకర్లు ఉన్నారనుకున్నావా పని చెయ్యడానికి' అత్తగారి కంఠం నిద్రలోనే వినబడి రేఖకు మెలకువ వచ్చింది. రేఖ లేవడానికి ప్రయత్నించింది. కాని తల నొప్పిగా ఉంది. జ్వరం తగిలినట్టుంది లేవలేకపోయింది.

అత్తగారు తిరిగి ఆ మాటలే అంది. రేఖ సమాధానం ఇవ్వకుండా ఉంటే

లేకపోయింది. 'పొద్దుటనుంచీ చేస్తూనే వున్నాను. అంత చాకిరీ చేసినందుకు మీ వదినగారి దగ్గర నుంచి సర్టిఫికెట్టు ఇచ్చారు అత్తయ్యా! నేనూ మీ అమ్మాయి లాంటి దాన్నే. అత్తగారు చాకిరీ చేయిస్తోందనే కదా! మీ అమ్మాయి ఇక్కడ వుంటోంది. జ్వరంతో పడుకుంటే నా సంగతి మీకు అవసరం లేదు. నేను మీ కూతుర్ని కాదుగా' రేఖ తిరిగి మంచం మీద వాలిపోయింది.

రేఖ కంఠం కంచు గంటలా మోగింది. కోడలి మాటలు ఎవరికైనా విన బడతాయేమోనని అటు ఇటు చూసింది. ప్రక్కన అద్దె కున్నవారు అప్పటికే తలుపు సందులోంచి చూస్తున్నారు.

కోడలు అలా అంటుందని ఊహించని అత్తగారు ఆ మాటలు వినలేక పోయింది.

'ఇంకా ఏదైనా అంటే ఆమె మరీ రెచ్చిపోతుంది. ఇంక ఈమెతో లాభం లేదు. తెలివి మీరింది' అనుకుంది మనస్సులో. మెల్లిగా వంటింటివైపు నడి చింది. ఆమె కూతుళ్ళు కూడా అక్కడే చేరారు.

'అందితే జుట్టు లేకపోతే కాళ్ళు అనుకునే రకాలు చాలామంది ఉంటారు. అందులో ఈ అత్తయ్య అటువంటిదే' అనుకుంది రేఖ మనస్సులో. ఏదైనా తన సమస్యకు పరిష్కారం దొరికిందని సంతోషించింది.

—0—

# పొదుపు చేసే కోడలు

సౌమ్య కాపురానికి వచ్చి రెండేళ్ళు అయింది. ఇంటి పెత్తనమంతా అత్త గారే చూసుకుంటోంది. సౌమ్య స్వభావసిద్ధంగా కూడా సౌమ్యురాలే.

'సౌమ్యా! ఇంటి ఖర్చు కొంచెం తగ్గించాలి' ఒకనాడు శేఖర్ భార్యతో చెప్పాడు.

'నాతో చెబుతారేమిటి? అంతా మీ అమ్మగారే చూస్తారుగా! ఆవిడతో చెప్పండి'

'మా అమ్మ పెద్దదయింది. ఇప్పటి సంగతులు ఆవిడకు సరిగా తెలియవు. నువ్వు కలుగజేసుకుని కాస్త పొదుపు చెయ్యాలి. మన పెళ్ళయింది మొదలు అప్పులు చెయ్యవలసి వస్తోంది. కాస్త నువ్వు పట్టించుకోవాలి" భార్య రెండు చేతులూ పట్టుకున్నాడు శేఖర్.

భర్త జాలి ముఖం చూసేటప్పటికి సౌమ్య హృదయం చెరువయింది.

'మీరు ఇన్నిసార్లు చెప్పాలా! నేను చూస్తాలెండి' అంది అతనికి ధైర్యం చెబుతూ.

భార్య మాటలకి అతని మనస్సు కుదుటపడింది. ఆనందంతో భార్యను హృదయానికి హత్తుకున్నాడు. అతని ఆప్యాయతకు మురిసిపోయింది ఆ ఇల్లాలు.

ఆ రోజు మొదలు అత్తగారి పెత్తనాన్ని జాగ్రత్తగా పరిశీలించడం మొదలు పెట్టింది. ఆవిడ సాధించినా, సూటిపోటి మాటలు అన్నా సౌమ్య పట్టించుకోలేదు.

అంతలో సంక్రాంతి పండుగ వచ్చింది. ఆ ఇంట్లో భార్యాభర్త కాకుండా అత్తగారే ఉంటోంది. ఎప్పుడైనా ఆడబిడ్డలు మాత్రం వచ్చివెడుతూంటారు. ప్రతి పండక్కీ బట్టలు తెమ్మని శేఖర్ తల్లికి డబ్బు ఇస్తుంటాడు. ఈసారి అయిదు వందలు భార్య చేతిలో పెట్టాడు బట్టలు తెచ్చుకోమని, సరుకులు తెమ్మని, అత్త గారికి కోపం వస్తుందని తెలిసిన సౌమ్య జాగ్రత్తగా మసలుకోవాలనుకుంది.

'అత్తా! నువ్వు బజారుకి ఏం వెడతావు! పెద్దదానివి అయిపోయావు నేను వెళ్ళి బట్టలు సరుకులు తెస్తాను' తిరిగి ఆవిడ సమాధానం చెప్పకుండానే సౌమ్య అక్కడనుంచి బయలుదేరి బజారుకు వెళ్ళిపోయింది.

నాలుగు షాపులు వెతికి కాస్త చవకగా ఉన్నవి. అందమైన రంగులనీ,

కొత్త రకానివి రెండు చీరలు అత్తగారికీ, తనకీ కొంది. తర్వాత తన లెక్క ప్రకారం సరుకులు కొని సిటీ బస్సెక్కి ఇంటికి వచ్చింది.

దసరాకి అత్తగారు కొన్న రెండు చీరల వెల కూడా తెలుసుకుంది. సగం డబ్బు మిగిల్చి అత్తగారు ఏం చేసింది? ఎంత ఆలోచించినా సౌమ్యకు అర్థం కాలేదు. 'అత్తా! ఇంక నీ పెత్తనం సాగదు.' అనుకుంది మనసులో.

ఆ రోజు అత్తగారు వంట గదిలోకి వెళ్ళబోయింది. 'అయ్యో అత్తా! నువ్వు పెద్దదానివి అయిపోయావు! వంట ఏం చేస్తావూ! నేను చేస్తాను. మీరు నాకు కాస్త సహాయం చెయ్యండి చాలు' అంది సౌమ్య.

ఎందుకు అలా అంటుందో తెలియని ఆవిడ ఏమీ అనలేక ఊరుకుంది. అత్తగారు ఆవడలకు, గార్లకు రెండుసేర్ల పప్పు పోసేది. సౌమ్య శేరు పప్పు మాత్రమే పోసింది. అలా అన్నింటిలోను జాగ్రత్త పడింది.

పండుగనాడు అత్తగార్ని కట్టుకోమని చీర ఇచ్చింది. తాను కూడా కొత్త చీర కట్టుకుంది.

'సౌమ్యా! ఈ చీర ఎంత అందంగా ఉందో! ఈ చీరలో నువ్వు మరీ బాగున్నావు' భార్య బుగ్గమీద చిటికె వేస్తూ.

సౌమ్య ముఖం కలువపూలా వికసించింది.

'పండక్కి మీరిచ్చిన డబ్బులో మిగిదనది రెండువందలు' అంటూ అతని చేతిలో పెట్టింది.

'అదేమిటీ!' అన్నాడు ఆశ్చర్యం పట్టలేక.

'రెండువందల రూపాయంతో రెండు చీరలు, ఒక వందతో సరుకులు, సరుకులు కూడా చాలా మిగిలాయి. ఇంక ఈ నెల కొనక్కరలేదు.

'ప్రతిసారి అయిదువందలిస్తే ఏడువందలు ఖర్చయ్యేది' అన్నాడు గుండె బాదుకుని.

పండగ పెత్తనం కోడలు తీసుకుందని అత్త గ్రహించడానికి అట్టేసేపు పట్టలేదు. అయినా మిగిలిన పెత్తనాలు మనవేగా అనుకుని సంతృప్తి పడింది ఆవిడ.

మరునాడు ఉదయం పాలవాడు కిటికీలో పాకెట్లు పెట్టాడు. 'ఓ పాంబ్బాయి

రేపటి నుండి లీటరున్నర చాలు బాబూ' అంది సౌమ్య పాలకేక వినబడగానే లేచివచ్చి.

'ఈ రోజు నుంచే తగ్గించండమ్మా!' అంటూ అతను మిగిలిన లీటరున్నర పాకెట్లు పట్టుకు వెళ్ళి పోయాడు.

మెళకువగానే మంచం మీద పడుకున్న అత్త ఆ మాటలు విని మనసులో బాధగా ఉన్నా ఏమీ అనలేకపోయింది.

పనిమనిషి వచ్చి బట్టలు ఉతుకుతోంది. 'బట్టలకి సర్ఫు నేవేస్తా। నువ్వు ఉతుకు' అంటూ బకెట్టు నీళ్ళలో కావలసిన సర్ఫు వేసి పాకెట్టు లోపల పెట్టింది.

'అదేమిటే! ఆ పాలతో గడ్డ పెరుగేం పోసుకుంటాము. పైగా నూనె కూడా తగ్గించావు! తగిన నూనె వెయ్యకపోతే వంటలేం బాగుంటాయి' అంది అత్తగారు బాధగా మాటలు సాగదీస్తూ.

'మీరు అలా కూర్చోండి అత్తా। మీకు గడ్డ పెరుగుపోస్తా చూడండి' ఆవిడకు గడ్డ పెరుగు పోసింది. కూరలు మరింత రుచిగా చేసింది. ఇంటి పెత్తనం పోయిన అత్తగారు కోడలిని సూటిపోటి మాటలు అనడం మానేసింది. సౌమ్య భర్తకు అయిదు వందలు మిగిల్చి ఇచ్చింది. భార్య పెత్తనం బాగుందనుకున్నాడు శేఖర్.

—o—

# భర్త అహంకారానికి భార్య తలవంచాలా ?

సీతా! సినిమాకు టైం అవుతోంది సిద్ధంగా ఉన్నావా! అంటూ గుమ్మం లోనే చెప్పాడు నారాయణ.

'ఆ సిద్ధంగా ఉన్నాను' రెడీగా ఉన్న సీత భర్త కేక విని గదిలోంచి ఇవతలకు వచ్చింది. అంతకు ముందురోజే నారాయణ స్నేహితులతో కలసి సినిమాకు వెడుతున్నామని చెప్పాడు. అందరూ భార్యలతో వస్తున్నారని సీతనుకూడా రమ్మనమని చెప్పాడు నారాయణ.

నారాయణ మొహం కడుక్కుని బట్టలు మార్చుతున్నాడు. సిత టిఫిన్ పెట్టి పక్కనే కూర్చుంది కుర్చీలో.

'ఈ చీరతోనే వస్తున్నావా?' ఆమెవైపు తలెత్తి చూసి నారాయణ అడిగాడు.

'ఏం బాగలేదా? అంది దవ్వుతూ.

నలుగురిలోకి వస్తున్నప్పుడు కొంచెం ఆలోచించి కట్టుకోవాలి అన్నాడు ముఖం చిట్లించి.

'అంటే' అర్థంకాని సీత అడిగింది.

'అంటే అని ఇంకా అడుగుతున్నావా? ఇంత పల్చని చీర కట్టుకుని వస్తే ఏం బాగుంటుంది ఆ మాత్రం తెలియకపోతే ఎలా?'

ఆ మాటలువిన్న సీతకు నోటమాట రాలేదు.

అంటే నలుగురిలో ఎలా ఉండాలో తనకు తెలియదనేగా అతని అభిప్రాయం ఈ చీర పల్చగా లేదు. ఎన్నోసార్లు ఆ చీర కట్టుకుంటే మెచ్చుకున్నాడు. తనకీ ఆ చీర అంటే చాలా ఇష్టం అందుకే కట్టుకుంది. తనకు ఏదీ తెలీనట్లుగా అలా సభ్యత లేనట్టుగా భర్త మాట్లాడుతాడని ఆమె ఊహించలేకపోయింది.

గుండుసూది గుచ్చినట్లుగా గుండె మూల్గింది. మనసు విలవిల్లాడింది.

మరోపక్క అవమానంతో కుంగిపోయింది. ఏ సమాధానం చెప్పకుండానే లేచి కాఫీకలిపి ఇచ్చి గదిలోకి వెళ్ళి మంచం మీద వాలిపోయింది.

భర్తను గౌరవించాలని, అతన్ని అర్థం చేసుకోవాలని చీటికిమాటికి ఘర్షణ పడకూడదని ఎంతో ప్రయత్నిస్తోంది. కాని భర్త సహకరిస్తున్నట్లు ఆమెకు అనిపించలేదు.

ఆమధ్య జరిగిన ఒక సంఘటన ఆమె మనసులో మెదిలింది

ఒకనాడు నారాయణ ఆఫీసుకు వెడుతూ హెల్‌మెట్ మరచిపోయి గేటు వరకు వెళ్ళాడు. హెల్‌మెట్ మర్చిపోతే ఎట్లా? అనుకొని సీత గేటుదాకా వెళ్ళి అందించింది.

"థాంక్యూ! బాగా జ్ఞాపకం చేశావు" అన్నాడు మెచ్చుకోలుగా నారాయణ

సీత చిరునవ్వు నవ్వింది.

స్కూటర్ స్టార్ట్ చేశాడు నారాయణ.

''గేటు వేసి లోపలికి వెళ్ళిపో'' అన్నాడు వెళ్ళిపోతూ.

సీత ఆ రోజు కూడా ఆశ్చర్యపోయింది. చిన్నపిల్లలకు చెప్పినట్లుగా అలా అన్నాడేమో లేక జాగ్రత్త కోసం చెప్పాడేమో అనుకుంది మరోసారి.

స్త్రీలంటే అమాయకులని, తలుపు వేసుకోడం కూడా తెలియని వారనా అతని ఉద్దేశం.

సీత మనస్సు పరిపరి విధాలపోయింది. ఒకవేళ అతని పెంపకంలో అలాంటివి అలవాటుఆయి ఉండాలి, అలవాటున అనేసి ఉంటాడు అని చివరకు సరిపెట్టుకుంది.

కానీ ఈ రోజు కూడా ఏమి మాటమీదో ఏదైనా అంటే గొడవ అవుతుంది చీర మార్చుకుని వచ్చింది.

''గుడ్. ఇలాంటి చీర కట్టుకోవాలి. లేటయింది నడు నడు'' అన్నాడు.

సినిమా హాల్లో మరో రెండు జంటలు కలిశాయి. అందులో ఒకావిడ మరీ సరదాగా మాట్లాడుతోంది. సినిమా చూసి ఎంతో ఉత్సాహంగా తిరిగివచ్చారు.

సినిమాకు వెళ్లేముందు జరిగిన చీర సంగతి మర్చిపోయింది సీత.

''ఏమిటా నవ్వులు అంత గట్టిగా నవ్వడం'' లోపల అడుగుపెడుతూనే నారాయణ అన్న మాటలకు సీత ఉలిక్కిపడింది.

''మీ మగవాళ్ళకంటే గట్టిగా నవ్వామా! ఆ హాల్లో సినిమాచూసి అందరూ నవ్వారు మేమూ నవ్వాము" సహనం నశించిన సీత సమాధానం చెప్పింది.

''నవ్వు నాలుగువిధాల చేటు అన్నారు. అది అణగిమణిగి ఉండడం నేర్చుకోవాలి'' అతని కంఠం కోపంతో పలికింది.

''మిస్టర్ నారాయణ్! మీ మగవాళ్ళకే కాదు మాకూ ఉంది బుద్ధి ఎప్పుడు నవ్వాలో, నవ్వకూడదో నీకంటే బాగా తెలుసు నాకు. ఆడదానికో శాస్త్రం మగవాడికో శాస్త్రంకాదు. నేను నేర్చుకున్నది సంస్కారం. ఒకళ్ళని గౌరవించడం తిరిగి గౌరవం పొందడం నాకు అలవాటు అది నీకు తెలీదనుకుంటాను. నేర్చుకోడానికి ప్రయత్నం చెయ్యి. అమాయకులకు చెప్పినట్లు నాకు చెప్పడానికి ప్రయత్నం చెయ్యకు. నేను తప్పులు పడితే నీలో చాలా ఉన్నాయి. మారడానికి ప్రయత్నించు' వంటింటివైపు నడిచింది సీత.

ఆమె మాటల్లో నిజం ఉందనుకున్న నారాయణ ఆలోచించడం మొదలు పెట్టాడు.



# భార్యాభర్తల మధ్య అవగాహన

'అమ్మాయి బి.ఎ. పాసైంది. వెంటనే పెళ్ళి చూపులకు రావలెను.

కనీసం బి.ఏ. చదువుకున్న అమ్మాయిని కాని పెళ్లి చేసుకోనని పట్టుపట్టిన ఆనంద్ తండ్రి ఉత్తరం చదువుకున్నాడు. వెంటనే ఆఫీస్‌కి శెలవుపెట్టి పెళ్ళి చూపులకి బయలుదేరాడు,

పెళ్లి కూతురు బాగానే ఉందనుకున్నాడు ఆనంద్.

'బి.ఎ. ఎప్పుడు పాసైయ్యారు?' శ్రీలక్ష్మిని ప్రశ్నించాడు.

'మొన్ననేనండి' ఆమె తండ్రి సమాధాన మిచ్చాడు.

'ఏ కాలేజీలో చదివారు' ఆ ఊళ్లో కాలేజీ లేనందువల్ల అనుమానంతో అడిగాడు ఆనంద్.

'ప్రవేటుగానండి' తిరిగి తండ్రే సమాధానమిచ్చాడు. తను అడిగిన ప్రశ్న లకి ఆమె సమాధానం ఇవ్వకుండా ఆమె తండ్రే సమాధానమిస్తూ ఉంటే చికాకు కలిగినా 'ప్రవేటుగా బి.ఎ. పాసైన ఆమె చాలా తెలివైనదై ఉండాలి అనుకుని సంబరపడ్డాడు ఆనంద్.

ఆనంద్ 'సరే' అనగానే పెళ్ళి ముహూర్తాలు పెట్టించేశారు. ఘనంగా పెళ్లి జరిగిపోయింది. పెళ్ళికి పిచ్చిన పెద్దనంతా ఈడు జోడు బాగుందన్నారు.

ఆనంద్-శ్రీలక్ష్మి కూడా చాలా సంతోషంగా ఉన్నారు.

మీ ఆయన బ్యాంక్ ఆఫీసర్ నీకేం లోటే ఇక రేపటినుంచి నువ్వు మాతో మాట్లాడతావా? వేళాకోళం చేశారు. శ్రీ లక్ష్మి స్నేహితురాండ్రంతా.

శ్రీలక్ష్మి ఆనంద్‌వేపు గర్వంగా చూసింది అతను చిరునవ్వు నవ్వాడు.

మొత్తంమీద బి.ఎ. పాసైన అమ్మాయినే పెళ్ళి చేసుకున్నావురా' అన్నారు ఆనంద్ స్నేహితులు.

ఆ మాటలు విన్న ఆనంద్ భార్యవేపు గర్వంగా చూశాడు. సిగ్గుతో మెలి కలు తిరిగింది శ్రీలక్ష్మి. వారినిచూసి ఇద్దరి తలిదండ్రులు సంతోషించారు.

శ్రీలక్ష్మిని కాపురానికి తీసుకెళ్ళాడు ఆనంద్.

స్నేహితులందర్నీ పిలిచి పార్టీ ఇచ్చాడు ఆనంద్.

పెళ్ళయిన వాళ్ళంతా భార్యలతో పార్టీకి వచ్చారు.

ఈడు-జోడు బాగుందని అంతా పొగిడారు-ఆనంద్‌కి చిన్ననాటి స్నేహితుడు చిన్నారావు భార్యతో వచ్చాడు.

'హాయ్ శ్రీలక్ష్మీ! నువ్వేటి ఎవరో అనుకున్నాను' అంది చిన్నారావు భార్య లత.

'హాయ్ లతా నువ్వా! అంది శ్రీలక్ష్మి.

'ఈవిడ లతండీ! నా చిన్ననాటి స్నేహితురాలు' అంటూ భర్త ఆనంద్‌కి పరిచయం చేసింది శ్రీలక్ష్మి.

చిన్నారావును పరిచయం చేశాడు ఆనంద్. వారి ఆనందానికి హద్దులేదు.

ఊరు కొత్త ఎలా ఉంటుందో ఏమో అనుకున్న శ్రీలక్ష్మి తన స్నేహితురాలు లత అక్కడే ఉన్నందుకు చాలా సంతోషించింది.

పార్టీకి వచ్చినవారంతా ఒకొక్కరూ తిరిగి వెళ్ళిపోతున్నారు.

చిన్నారావును, అతని భార్యను కాసేపు ఉండమని ఆపాడు ఆనంద్.

'ఆనంద్-నేనూ చాలా ఫ్రెండ్స్‌మండీ. ఇద్దరం బ్యాంక్ ఆఫీసర్లమవాలని ఎంతో ప్రయత్నించాము. కాని పరీక్ష పాస్ కాలేకపోయాము. ఇక మీరు వచ్చారు కనక ఆనంద్‌ని చదివించాలండీ' అన్న చిన్నారావు మాటలకు ఉలిక్కిపడ్డ శ్రీలక్ష్మి తలెత్తి కోపంగా భర్త వేపు చూసింది.

భార్య మొహంలోకి చూడలేని ఆనంద్ ఎటో చూశాడు.

'మేమూ అంతేనండీ బి.ఎ. పాస్ అవుదామని ఎంత ప్రయత్నించినా చదవడమే కుదరలేదు. అది పల్లెటూరు కదండీ' లత మాటలకు ఉలిక్కిపడి భార్యవేపు తెలతెలబోయి చూశాడు ఆనంద్.

శ్రీలక్ష్మి ఆనంద్‌ని చూడలేక తలదించుకుంది.

'మించిపోయిందేముంది. మాతోపాటె మీరు చదువుకోవచ్చు. వెంటనే పరీక్షకి కట్టేయండి' అన్నాడు చిన్నారావు.

ఆ మాటలకు అంగీకరించినట్లుగా తలెత్తి చూసిన ఆనంద్. శ్రీలక్ష్మిల చూపులు కలుసుకున్నాయి.

'నిజమేనా!' అన్నట్లు ఉన్నాయి ఇద్దరి చూపులు.

కోపం పోయి ఇద్దరి పెదవులు విచ్చుకున్నాయి.

'చాలా ఆలస్యమైంది ఇక మేం వెడతాం' అంటూ చిన్నారావు భార్య చెయ్యి పట్టుకొని కదిలాడు.

ఆ జంటను నవ్వుతూ సాగనంపారు శ్రీలక్ష్మి, ఆనంద్‌లు. ఇద్దరి హృదయాల్లోని భారం దిగి తేలికైనట్లు అనిపించింది. ఇద్దరి మధ్య నిజమైన అవగాహన పెరిగింది.

—0—

# పొదుపరి భర్త

'కొబ్బరినూనె అయిపోయిందండి' భార్య మాటలు విననట్లే పేపరు చదువుతున్నాడు శ్రీపతి.

'కొబ్బరినూనె కేవాలండీ' భర్త తన మాటలు వినలేదనుకున్న నమ్రత తిరిగి అంది.

'అప్పుడే అయిపోయిందా? మొన్ననేకదా వెచ్చాను. శ్రీపతి భార్య జడవైపు చూస్తూ అన్నాడు చికాగ్గా!

'నెల అయిందండీ కొబ్బరినూనె కొని. ఈసారి తాతావారిది కొనండి. కల్తీ ఉండదు' అంది నమ్రత.

"నెలేనా అవుతా. అంతగా తలకి నూనె పట్టించుకోకూడదు. కాస్త జాగ్రత్తగా వాడుకోడం నేర్చుకోవాలి'

'జాగ్రత్తగానే వాడుతున్నానండి' నమ్రత మరింత వినయంగా సమాధానమిచ్చింది.

'అప్పే ఇంత దుబారా అయితే చాలా కష్టం. మరికాస్త జాగ్రత్తగావాడాలి సాయంకాలం కొంటాను' అతని మాటలు కరుగ్గా ఉన్నాయి.

నమ్రత మనస్సు చివుక్కుమంది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. భర్త చూడకుండా కళ్ళు తుడుచుకుంది.

శ్రీపతి చాలా పొదుపరి. నమ్రత కొత్తగా కాపురానికి వచ్చింది. ఆమెది పొడవైన జడ. దానివల్లే కొబ్బరినూనె ఖర్చు ఎక్కువవుతోందని అతని అనుమానం. ఆ ఖర్చు ఎలా తగ్గించాలా అని ఆ రోజల్లా ఆలోచిస్తూనే ఉన్నాడు. మిగతా ఖర్చులో అతనికి అంతగా తేడా కనబడలేదు.

ఆ సాయంకాలం స్నేహితుడు శేఖరం, అతని భార్య శ్రీపతి ఇంటికి వచ్చారు. నమ్రత భర్త చెప్పినట్టుగానే వాళ్ళని ఎంతో సంతోషంగా ఆహ్వానించింది. అతను చెప్పినట్టగానే ఉప్మాచేసి, టీ కలిపి ఇచ్చింది. శ్రీపతి దృష్టి అంతా శేఖరం భార్య జుట్టుమీదే ఉంది. ఇదివరకు చూసినప్పుడు ఆవిడ జడ మరీ అంత పొడవు కాకపోయినా పొడవుగానే ఉండేది. ఇప్పుడు పోనీటైల్ కట్టుకుని

ఉంది. ఆ పద్ధతి బాగుందని అనుకున్నాడు శ్రీపతి. కాసేపు కూర్చుని శేఖర్ భార్యతో వెళ్ళిపోయాడు.

'నమ్రతా! ఆమెజుట్టు ఎంత బాగుందో చూసావా! గాలికి ఆ జుట్టు అలా ఎగురుతూ ఉంటే ఎంత అందంగా ఉందో చూసావా?' ఏదో విధంగా శ్రీపతి భార్యకు నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు. జుట్టు అలా కత్తిరించుకుంటే కొబ్బరినూనె ఖర్చు తగ్గుతుందని ఆతని ఉద్దేశం.

'పెద్దజడ అంటే ఇష్టమనే కదండీ నన్ను పెళ్ళి చేసుకున్నారు. నాకు అలా జుట్టు కత్తిరించుకుంటే ఇష్టముండదండీ' భర్త మనస్సులో ఏముందో తెలియని నమ్రత సమాధాన మిచ్చింది.

'పెద్దజడ బాగానే ఉంటుంది కాని ఇప్పుడు ఇది ఫేషన్‌గా ఉంది నమ్రతా. ఆ కటింగ్ చాలా బాగుంటుంది.' భార్య గెడ్డం పట్టుకుని మరీ చెప్పాడు శ్రీపతి.

'అలాగే చూస్తాలెండి' భర్త మాట కాదనలేకపోయింది నమ్రత.

భార్య 'సరే' అన్నందుకు సంతోషించాడు శ్రీపతి. వెంటనే బజారుకెళ్ళి కొబ్బరినూనె డబ్బా కొన్నాడు.'

'ఈ డబ్బా రెండు నెలలు రావాలిసుమా!' అన్నాడు భార్యతో.

'అలాగేనండి' అంది నవ్వుతూ నమ్రత.

మరునాడు ఆఫీసుకి హుషారుగా బయలుదేరాడు శ్రీపతి.

ఆ రోజు కొంచెంపని ఎక్కువగా ఉంది. పని పూర్తి చేసుకుని శేఖర్, శ్రీపతి కేంటెన్‌వైపు నడిచారు.

రోజూ టిఫిన్ తినే శేఖర్ టీ మాత్రమే తీసుకుంటానంటే ఆశ్చర్యపోయాడు శ్రీపతి.

'అదేం శేఖర్ టిఫిన్ తినవా? ఉండబట్టలేక అడిగాడు.

'ఈనెల ఖర్చు ఎక్కువయింది' అందుకే టిఫిన్ మానేసాను' శేఖర్ సమాధానం విని ఆశ్చర్యపోయాడు శ్రీపతి.

'అంత ఖర్చు ఏం చేశావ్ శేఖర్?' శ్రీపతి అడిగాడు.

'ఏం చెప్పమంటావు శ్రీపతీ! ఏదో మా ఆవిడ సరదాగా జుట్టు కట్

చేయించుకుంటానంటే సరే అన్నాను. కానీ ప్రతీనెల ఇంత ఖర్చు ఉంటుందనుకో లేదు. నా టిఫిన్ ఖర్చు అంతా అటు అవుతోంది' అన్నాడు బాధగా.

ఆ మాటలు విని ఉలిక్కిపడ్డాడు శ్రీపతి. అతని గుండెల్లో రాయి పడింది. 'అర్జంటుగా ఇంటికెళ్ళాలి శేఖర్ అంటూనే శ్రీపతి ఆ పూట శెలవుపెట్టి ఇంటికి బయలుదేరుతుంటే శేఖర్ వింతగా చూసాడు.

'అదేమిటండీ అప్పుడే వచ్చేసారు' గుమ్మంలోనే అడిగింది నమ్రత.

''అబ్బే! ఏంలేదు నమ్రతా! నువ్వు గుర్తుకు వచ్చావు అంతే'' భర్త మాటలకి మురిసిపోయింది నమ్రత.

''ఈ వాలు జడ నీకు ఎంత బాగుందో, ఆ జుట్టు కటింగ్‌లు నీకు నచ్చవు నమ్రతా" భర్త ఆలా ఎందుకంటున్నాడో తెలియని నమ్రత తెల్లబోయి చూసింది కాని ఈసారి భర్త మాటలకు తలాడించలేకపోయింది నమ్రత.



# భర్త ఉద్యోగం చిన్నదైతే...

మీరు ఆఫీసుకి వెళ్ళిన తరువాత నాకేం తోచడం లేదండీ! నేను కూడా ఏదైనా ఉద్యోగం చేస్తానండి అంది మోహన భర్తతో.

శశిధర్ ఆశ్చర్యంగా చూసాడు భార్యవైపు.

కాలక్షేపానికి పుస్తకాలు చదువుకోవచ్చు. మిషన్ కుట్టు నేర్చుకోవచ్చు. ఉద్యోగమే చెయ్యాలా" అన్నాడు భార్యకు నచ్చచెప్పే ధోరణిలో.

పుస్తకాలు చదువుతూనే ఉన్నాకదండి. ఇద్దరి మనుషులకు రోజూ మిషను మీద కుట్టే బట్టలేముంటాయండి ఏదైనా చిన్న ఉద్యోగం మీరే చూసిపెట్టండి" అంది బతిమాలె ధోరణిలో.

''చూద్దాం!''

భర్త ఆఫీసుకి వెళ్ళిన తరువాత మోహన చాలాసేపు ఆలోచించింది. చివరకు ఒక నిశ్చయానికి వచ్చినట్లుగా ఇంటికి తాళం పెట్టి వీధి చివరనున్న స్కూలు వైపు నడచి హెడ్ మిస్ట్రెస్ గదిలో అడుగుపెట్టింది.

మా దగ్గర వేకెన్సీలు ఉన్నాయనుకోండి. అప్లికేషన్స్ కూడా చాలా వచ్చాయి మీరు ఇంగ్లీషు మీడియంలో బి.ఏ. పాస్ అయ్యానంటున్నారుగా। పైగా స్కూల్‌కి దగ్గర్లో ఉన్నారన్నారుగా మూడువందల రూపాయలు మించి ఇవ్వలేం. ఇష్టముంటే వెంటనే జాయిన్ అవండి. చాలా శ్రద్ధగా చెప్పాలి" అంది ఆవిడ మోహన చెప్పినవి విని.

వెంటనే జాయిన్ అవుతానండి. తడబడే మాటలతో అంది మోహన ఉద్యోగం అంత త్వరగా దొరుకుతుందని ఆమె అనుకోలేదు. చెప్పులు అరిగేటట్టు కాళ్ళు నొప్పులు పెట్టేవరకు తిరగాలనుకుంది. ఆమె సంతోషానికి అంతులేదు.

వెంటనే ఆవిడ చెప్పిన 1వ తరగతికి ఇంగ్లీషు చెప్పడానికి వెళ్ళింది, ఆమె టీచింగు అందరు మెచ్చుకున్నారు. ఆ సాయంకాలం స్కూలు వదలగానే ఇంటికి వెళ్ళింది. భర్త రాకకోసం ఎదురు చూసింది.

శశిధర్ రాగానే జరిగినదంతా చెప్పింది. అంత తేలికగా ఉద్యోగం దొరికినందుకు అతను కూడా చాలా సంతోషించాడు. శశిధర్ స్వభావ సిద్ధంగా నెమ్మదస్తుడు పైగా స్నేహశీలి. నిరాడంబరుడు. తనకు కాని పనిమీద వేసుకోడు భార్య ఉద్యోగం చెయ్యాలనుకోలేదు అతను. చేస్తే మంచిదే అనుకున్నాడు.

పట్టుదలగల మోహన స్కూల్లో ఉద్యోగం చేస్తూనే బాంక్ పరీక్షలు రాసింది.

ఆఫీసరుగా సెలక్టు అయింది. మోహనతోపాటు శశిధర్ కూడా చాలా సంతోషించాడు. అనతికాలంలోనే మోహన బాంక్ మేనేజరు కూడా అయ్యింది. గవర్నమెంటు ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్న శశిధర్ సీనియర్ గుమాస్తా అయ్యాడుకాని అంతకంటే పెద్ద ఉద్యోగం రాలేదు. భార్య జీతం ఎక్కువయినా అది పెద్ద ఉద్యోగం అయినా అతను సంతోషంగానే ఉన్నాడు. పైగా మునపటిలాగే భార్యతో ఎంతో సంతోషంగా ఉంటున్నాడు.

మోహనలో ఎటువంటి మార్పు లేకపోయినా ఇతరులవల్ల ఆమెలో తాను పెద్ద ఉద్యోగస్థురాలనే అహంకారం తలెత్తడం ప్రారంభించింది. అక్కరలేని ప్రశ్నలు వేస్తూ జనం ఆమెను బాధిస్తున్నారు

'మీవారు బాంకు మేనేజరేనా? లేక ఇంజనీరా? డాక్టరా?' అలా ఎదుటి వారి ప్రశ్నలతో ఆమెలో బాధ ప్రారంభమైంది. భర్త చిన్న ఉద్యోగస్థుడు కావడంవల్ల నలుగురిముందు అవమానంగా భావించింది. అయినా ఇంకా ఆలో చిస్తూనే ఉంది.

ఒకరోజు మోహన చిన్ననాటి స్నేహితురాలు భర్తతో వచ్చింది. ఆమెభర్త ఓ కంపెనీలో పెద్ద ఆఫీసరు. ఆ స్నేహితురాలు వచ్చింది మొదలు భర్త హోదాని భర్త జీతాన్ని పొగుడుతూనే ఉంది.

తానలా భర్త ఉద్యోగాన్ని గురించి పొగడుకునే అవకాశం లేనందుకు మనస్సులో బాధ పడింది మోహన. భర్తతో మునపటంత సంతోషంగా ఉండ లేకపోతోంది. ఇవేమీ పట్టించుకోని శశిధర్ తన సహజధోరణితో వారికి సౌకర్యాలు చూస్తూనే ఉన్నాడు. భార్య అవసరాలన్నీ చూస్తూనే ఉన్నాడు.

ఆ రోజురాత్రి అందరు సినిమాకు వెళ్ళారు. స్నేహితురాలు భర్త నోట్లో మాట నోట్లోఉండగానే భార్య చెయ్యాలి లేకపోతే అందరూ ఉండగానే ఆమెను కోపం చేస్తూనే ఉన్నాడు. అది విన్న మోహన ఆశ్చర్యపోయింది. పెద్ద ఉద్యో గస్తుడు కదా భార్య కాస్త జాగ్రత్తగా మసలుకోవాలి అనుకుంది మనస్సులో.

ఇంటికి రాగానే భార్య లుంగీ అందించలేదని కోపంతో 'రాస్కెల్ ఇంకా ఏం చేస్తున్నావే' అంటు దవడ పగల కొట్టాడు. ఆ చప్పుడికి అటు చూసిన మోహన ఆశ్చర్యపోయింది. స్నేహితురాలు నోరుమెదపలేదు. లుంగీ తీసి ఇచ్చింది.

మోహన మనస్సు చివుక్కుమంది. వెళ్ళి అతన్ని రెండు తిట్టాలనుకుంది. స్నేహితురాలు మొహంచూసి ఏమీ అనలేకపోయింది. ఆమె మనస్సు భర్త వైపు మళ్ళింది.

'నిజంగా తనభర్త చాలా మంచివాడు. ఎంతో సంస్కారవంతుడు భర్తకు కావలసింది హోదా జీతంకాదు. భార్యను గౌరవించే సంస్కారం తనకు జీతం ఎక్కువైన ఎప్పుడూ అగౌరవపరచలేదు భార్యభర్త ఒక్కటే అయినప్పుడు ఇద్దరిలో ఎవరి ఉద్యోగం పెద్దదైనా సంతోషించాలి కాని అవమానపరచుకోకూడదు" అనుకుంది. తనకుతానే సిగ్గుపడింది. తన అజ్ఞానం తొలగిపోయినందుకు సంతోషించింది. ఆ రాత్రి భర్త దగ్గర మరింత గారాలుపోయింది మోహన.

—o—

# కారణంలేని కలహాలు

పార్వతీ! తలపగలి పోతోంది. ఓ! కప్పు టీ! ఇంట్లోకి వస్తూనే హడావిడి చేశాడు మారుతీరావు.

'ఆ! వస్తున్నానండీ! టీ రెడీగా ఉంచా' టీ కప్‌తోనే ఎదురు వచ్చింది భార్య పార్వతి

ఈ హెల్‌మెట్ భారంతో మరింత తలనొప్పి వస్తోంది. ఆఫీసర్‌కంటే భారంగా ఇది తలకెక్కి కూర్చుంది అంటూనే హెల్‌మెట్ తీసి పక్కకుపెట్టి టీ కప్పు అందుకని కుర్చీలో వాలాడు మారుతీరావు.

'టీ చల్లారి పోతుంది ఇంకా తాగరేం' తాను తెచ్చుకున్న కప్పులో టీ చప్పరించింది పార్వతీ.

'పార్వతీ! ఈ రోజు నీ చేతి టీ అమృతంలా ఉందనుకో' అంటూ టీ తాగడం మొదలెట్టాడు మారుతీరావు.

'నేను రోజూ ఒకలాగే కలుపుతానండీ. మీ నాలుకలోనే ఏదో తేడా ఉన్నట్లు ఉంది.'

'ఈ రోజు స్పెషల్‌గా చేసినట్లున్నావు? ఏదో విశేషమున్నట్లుంది పార్వతీ!'

'అబ్బే ఏముంది విశేషం ఏం లేదండీ'.

'అదిగో నీ నవ్వే చెబుతోంది'

'అవునండీ! మా మేనత్తగారి అబ్బాయి పెళ్ళి మనం వెళ్ళాలండీ!'

'ఆ నత్తి నత్తిగా మాట్లాడుతూ ఆడవాళ్ళ చుట్టూ తిరిగే అతనేనా?'

'ప్రతివారికి అలా వంకపెడితే ఎలాగండీ! మీరు మాత్రం ఆడవాళ్ళతో మాట్లాడరా!'

'అనవసరంగా నేను ఎవరితోను మాట్లాడను తెలిసిందా!'

'మీ సంగతి నాకెందుకు తెలీదు. మా మామయ్య కూతురువస్తే దానిచుట్టూ మీరు తిరగడం నాకు తెలుసండీ!'

'నువ్వేం తక్కువ దానివా! మీ మేనత్త కొడుకుతో వాగడం నేను చూడ లేదనుకుంటున్నావా? మీ ఆడవాళ్ళందరిలోను ఉన్న జబ్బే ఇది. మగవాళ్ళతో సరదాగా మాట్లాడ్డం తరువాత తప్పు బట్టడం మీతో వేగడం కష్టం?"

'మీ మగవాళ్ళేం తక్కువ వాళ్ళా! అందంగా ఆడది కనబడితే చాలు గుడ్లు మిటకరించి చూడ్డం ఛీ! ఛీ! పాడు బుద్ధులు''

'మా యిష్టం మేం చూస్తాం మే మా ఇష్టమొచ్చిన వాళ్ళతో మాట్లాడతాం ఏం చేస్తావో చేసుకో"

'తెగించిన మగవాళ్లు ఉంటే ఆడది ఏం చెయ్యగలదండీ! ఇదంతా మా ఆడవాళ్ళ ఖర్మ అండి ఖర్మ' పార్వతీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ముక్కు చీదుకొని కళ్ళు ఒత్తుకుంది.

'చేసిందంతా చేసి ఖర్మ అంటావేం, మా పురుషుల్ని లొంగదియ్యడం మీ తరంకాదు, మా ఇష్టం వచ్చినట్లు ఉంటాం'

ఉండకేం ఉంటారు బరువు బాధ్యతా లేకుండా హాయిగా ఉంటారు. అయినా మిమ్మల్ని అని ఏం ప్రయోజనమండీ! అందరూ చెబితే నేవినలేదండీ!"

'అందరు ఏమని చెప్పారు అదేదో అఘోరించరాదు'

'అయ్యో! తెలీనట్లు నటించకండి మీ ఆఫీసులో మేరీ టైపిస్టుని మీరు స్కూటర్ మీద దింపడం అందరూ చూశారండీ మిమ్మల్ని నమ్మడం నాదే తప్పు'

ఆ మేరీని స్కూటర్ ఎక్కించుకుంటాను రేపొద్దుట నెత్తి మీద ఎక్కించు కుంటాను ఏం చేస్తారు నన్ను'

'ఏం చేస్తామండీ! చేసేదే చేస్తా! ఇదిగో ఆ మేరీని తెచ్చి ఇంట్లో పెట్టు కోండి. నేను మా పుట్టింటికి వెళ్ళిపోతున్నా' పార్వతి కారే కన్నీళ్ళు తుడుచుకుంటూ లేచి గదిలోకి వెళ్ళి పెట్టె సర్దుకోడం మొదలు పెట్టింది.

'వెళ్లు వెళ్లు ఇక్కడ ఎవరికీ ఏం నష్టం లేదు! వెంటనే వెళ్ళిపో మరింత గట్టిగా అరిచాడు మారుతీరావు.

'మీరు ఉండమన్నా ఉండను ఇదిగో వెళ్ళిపోతున్నా సర్దుకున్న పెట్టె చేత్తో పట్టుకుని ఇవతలకు వచ్చింది పార్వతి.

'అమ్మాయీ! ఏం చేస్తున్నారమ్మా దగ్గరగా ఉన్న తలుపులు తోసుకుని లోపల అడుగుపెట్టారు పార్వతి తండ్రి.

'తండ్రిని చూసిన పార్వతి చేతిలో పెట్టి నేలమీద పడేసింది,'

'మీరా! మామగారూ! రండి! రండి!' లేని నవ్వు తెచ్చుకుని మామగారిని ఆహ్వానించాడు మారుతీరావు.

'అల్లుడుగారూ బాగున్నారా! ఆ చేతిలో పెట్టేమిటమ్మా' అడిగాడు తండ్రి.

'ఏం లేదునాన్న! కొత్తగా పెట్టి కొనుక్కుంటేను నగం చెప్పి నాలిక కరుచుకుంది పార్వతి.

'అదేమిటమ్మా! ఇది నేను కొనిచ్చిన పెట్టేగా'

'పెట్టి కాదు నాన్న కొత్త చీర కొనుక్కున్నాను అది ఆయనకి చూపిద్దామని

'అలాగా! ఏదీ చీర' అడుగుతున్న తండ్రి మాటలకు అడ్డు వచ్చిన పార్వతి 'కాఫీ కలిపి తెస్తానుండు నాన్న' అంటూనే పెట్టి పట్టుకుని లోపలికి పరుగెత్తింది. భార్య జరిగిన సంగతి ఎక్కడ మామగారికి చెబుతుందోనని భయపడ్డ మారుతీరావు 'హమ్మయ్య రక్షించింది' అంటూ ఊపిరి పీల్చుకున్నాడు మారుతీరావు.

'ఆకలి హానండీ' అంటూనే కాఫీ పట్టుకొచ్చి తండ్రికి ఇచ్చింది.

'అమ్మాయీ! ఇదిగో వంటచేయకు మనం సినిమాకు వెళ్ళి హోటల్లో భోజనం చేసి వచ్చేద్దాం త్వరలండి అల్లుడిగారూ" అన్నాడు ఆయన.

'నేను రెడీ అండీ' అంటూనే మారుతీరావు కుర్చీలోంచి లేచాడు'

'సినిమాకి బయలుదేరారు ముగ్గురు'.

హాల్లో నవ్వుతూ మాట్లాడుకుంటున్న కూతుర్ని అల్లుణ్ని చూసి హమ్మయ్య అనుకున్నాడు ఆయన.

'ఇంతకీ మీరిద్దరు పెళ్ళికి వస్తున్నట్లేనా?' నవ్వుతూ అడిగాడు ఆయన ఆటోలో తిరిగివస్తూ.

'ఏ పెళ్ళికండీ' మారుతీరావు తెలీనట్లు అడిగాడు.

'మా మేనల్లుడి పెళ్ళికయ్యా'

'ఎందుకు రామండీ ఇద్దరం వస్తాం' మారుతీరావు భార్యవైపు చూసి సమాధానమిచ్చాడు.

అయితే ఇందాకటి వాద ప్రతి వాదనలు ఆయన వసిగాడు.

మీరు విన్నారా మామగారూ! తెల్లబోయాడు మారుతీరావు.

అవునయ్యా బాబూ! హడలిపోయానను కో.

అర్రే! అప్పుడే మర్చిపోయామండీ! అవునా పార్వతీ.

నవ్వుతూ తలూపింది పార్వతి మనసులోనే సంతోషించాడు ముసలాయన.

—0—

# పండగ వచ్చింది బాబోయ్

'మీ నాన్నదగ్గర నుంచి ఉత్తరం వచ్చిందా ఆఫీసునుంచి రాగానే భార్యను హడావిడిగా అడిగాడు సుబ్బారావు'

'రాలేదండి' తాయారు వెంటనే సమాధాన మిచ్చింది.

'అవునులే ఎందుకు వస్తుంది? ఏదో ఒక పండక్కి పిలిచి బాధ్యత దులుపుకున్నాడు. నా స్నేహితుడు చూడు ప్రతి పండక్కి అత్తవారింటికి వెడుతున్నాడు'

'అలా ప్రతి పండక్కి వెడుతుంటే ఏం బాగుంటుంది చెప్పండి, వాళ్ళకి భారం మాట ఎలా ఉన్నా ఊళ్లోవాళ్ళు చూసి నవ్వరటండీ'

'అసలు నీ మూలానే ఇదంతా! నీ కసలు పండక్కి పుట్టింటికి వెళ్ళాలనే ఉండదు. మీ నాన్నకి డబ్బు ఖర్చు అవుతుందని బాధ. అసలు నువ్వే మీ నాన్నకి ఉత్తరం రాయవద్దని చెప్పి ఉంటావు' మామగారు పండక్కి పిలవలేదన్న కోపమంతా భార్యమీద చూపించాడు.

'ఈ మగవారికి అత్తవారింటిమీద అంత మమకారమెందుకో'

మనసులో అనుకున్న తాయారు మాటలు పైకి వినబడ్డాయి.

'ఇదిగో తాయారూ! నువ్వు ఇంకా ఇలాగే మాట్లాడావంటే నాకు కోపం వస్తుంది. నాకు కోపంవస్తే మనిషిని కానని నీకు తెలుసు' కోపంతో ఊగిపోయాడు సుబ్బారావు.

'పోస్టు' అన్న కేక విని సుబ్బారావు గుమ్మం దగ్గరకు పరుగెత్తాడు. ఉత్తరం అందుకున్న సుబ్బారావు కవరుచింపి గబగబా చదవడం మొదలుపెట్టాడు.

"ఎవరు రాశారండీ" కుతూహలం పట్టలేక అడిగింది తాయారు.

'మీ నాన్నదగ్గర నుంచి కాదులే' విసుగ్గా సమాధానమిచ్చాడు సుబ్బారావు అతని ముఖంలోని మార్పును గమనించిన తాయారు వచ్చే నవ్వును ఆపుకుని.

'మరెవరు రాశారండీ' అని అడిగింది.

'నా మొగుడు రాశాడు' కసురుకున్నాడు సుబ్బారావు.

తాయారుకి ఎవరు రాశారో అర్థంకాలేదు. వివరాలు తెలుసుకోకుండా ఉండలేకపోయింది.

'ఏమని రాశారండీ' నవ్వుతూ అడిగింది.

ఆమె నవ్వు చూసేక అతని కోపం మరింత పెరిగింది.

'ఏం తాయారూ నన్ను చూస్తే నీకు వేళాకోళంగా వుందా। ఇదిగో ఈ సంక్రాంతి పండగ నా ప్రాణానికి వచ్చింది. ఏం పండగలో ఏమో! ఇవన్నీ డబ్బు ఖర్చుకే వచ్చినట్లున్నాయి. అయినా ఎవరు పిలిచారని ఇప్పుడు తయారవడం ఛీ! ఛీ నేనెక్కడా చూడలేదు ఇలాంటి మనుషుల్ని" నెత్తిని చేతులు పెట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు సుబ్బారావు.

'ఇంతకీ ఎవరండీ ఆ ఉత్తరం రాస్తా' తాయారు అడిగింది నెమ్మదిగా.

'నా మొగుడని చెప్పానుగా' అర్థం కాలేదా! సుబ్బారావు రెట్టించాడు.

'మగాళ్ళకి మొగుళ్లు' ఉంటారని తెలీక అడిగానండీ' తాయారు తిరిగి సమాధాన మిచ్చింది.

'నా చెల్లెలు మొగుడే నా మొగుడు. ఆ మాత్రం తెలీకపోతే ఎట్లా? పండక్కి రమ్మనమని పిలవకుండానే బయలుదేరి వచ్చేస్తున్నాడు. ఈ పండుగలు ఎందుకు వచ్చిపడ్డాయో ఏమో' విసుక్కున్నాడు సుబ్బారావు.

మీరే కదండీ ఇప్పటివరకు అత్తవారింటికెళ్లాలని తెగ తాపత్రయపడ్డారు. అలాగే మీ బావమరదీ అత్తవారింటికి రావాలనుకున్నాడు. అయినా అత్తవారింటి మీద మమకారం ఉన్న మగాడేగా' అంది సాగదీస్తూ తాయారు.

'ఇదిగో సమయానికి దెప్పడంకాదు తాయారు. ఇప్పుడు వాళ్ళిద్దరు పండక్కి వస్తే నాదగ్గర అంత డబ్బులేదు. ఇప్పుడు ఏం చెయ్యాలి' ఈ పండగలు రాక పోయినా బాగుండేది.

'అవునండీ! మీకు పండగలు ఉండాలి. మరెవరికీ పండగలు ఉండకూడ దంటే ఎలాగండీ! ఇదిగో నేదాచిన డబ్బు ఉంది. అది పెట్టి మీ చెల్లెలికి, భర్తకి బట్టలు కొనిపెట్టండి అంతేకాదు నేను ఆఫీసులో లోను తీసుకున్నాను. స్కూటర్ కొనండి' అ టూ భర్త చేతికి ఆ డబ్బు అందించింది తాయారు.

'తాయారూ! నువ్వెంత మంచిదానివీ' సుబ్బారావు సంతోషం పట్టలేక పోయాడు.

'పండక్కి అత్తవారింటికెళ్ళాలని అనకండి అంది నవ్వుతూ తాయారు' శ్రుతి కలిపాడు సుబ్బారావు.

—0—

# ఈ సమస్యకు మరో పరిష్కారం

'శారదా! ఏం చేస్తున్నావే ప్రొద్దుటే' లత పరుగెత్తుకుంటూ వచ్చింది.

పేపరు చదువుదామని కూర్చున్న శారద లతను చూసి చేతిలో ఉన్న పేపరు కిందపడేంది.

'శారదా! నువ్వు లేవాలి! రేఖ సీరియస్‌గా వుంది.'

ఆ మాటలు విన్న శారదకు నోటమాట రాలేదు. ఎదురుగా టీపాయ్ మీద ఉన్న కాఫీ తాగాలని మరిచేపోయింది. లత వెంట బయలుదేరింది.

శారద, లత బయలుదేరి వెళ్ళేటప్పటికి రేఖ ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి. రేఖ ఆత్మహత్య చేసుకున్నదన్నారు అంతా.

'అయ్యో శారదా! ఎంతపని చేసావే? ఆఫీసులో అన్ని గొడవలుంటే చెప్పావు కాదే' అంటూ చీరలె త్తేస్తోంది రేఖ అత్తగారి.

పోస్టుమార్టమ్‌లో రేఖ నిద్ర మాత్రలు మింగినదని తెలిసింది. రేఖకు అన్ని బాధలు ఉన్నట్లు కానీ, అంత బాధపడుతున్నట్లు కాని కావలసిన వారితో ఎప్పుడూ చెప్పుకోలేదు.

ఆమె ఆత్మహత్యకు కారణం ఏదైనా దొరుకుతుందని వెతికారు. కాని ఏమీ దొరకలేదు.

రేఖ తండ్రి అత్తగారు, భర్త ఆడబిడ్డలు బాధలు పెట్టడం వల్లనే చనిపోయిందని కేసు పెట్టాడు.

పోలీసులు వచ్చి అత్తగారిని ఆడబిడ్డని, భర్తని, మరిదిని అరెస్టుచేసి తీసుకు వెళ్ళారు.

అత్తగారు ఆఫీసు గొడవలవల్ల చనిపోయిందనే శోకాలు సాగతీస్తూనే వుంది. శోకాలు నటనని ఆఫీసు గొడవలవల్ల చనిపోలేదని అక్కడి వాళ్ళందరికి అనిపిస్తూనే వుంది.

తరచు రేఖ యింటికి వచ్చే వారివల్ల ఇరుగు పొరుగులవల్ల క్రమంగా విషయాలన్నీ బయటపడ్డాయి. రేఖ మరణానికి కారణాలు తెలిసాయి. బి.ఏ. పాస్ అయిన రేఖ పెళ్ళి అయిన తరువాత కూడా బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తూనే వుంది.

ఇంట్లో అంతపనిచేసి ఆఫీసుకి వెళ్ళాలి. అక్కడ పనిపూర్తి చేసుకుని ఇంటికి రాగానే తిరిగి చాకిరీ మొదలు పెట్టాలి. రాత్రి పదకొండు వరకు అలా వంట ఇంటితో సరిపడేది. ఆడబిడ్డ పురిటికి రావడం, చుట్టాలు రావడం వెళ్ళడం వాటితోటే సరిపడుతోంది. ఆ చాకిరి చెయ్యలేక పోతోంది. రేఖకు తలనొప్పి ప్రారంభమైంది. రాత్రి కొంచెం జ్వరం తగలడం ప్రారంభించింది. 'ఏం రోగిష్టి పిల్లో ఏమో। మా ప్రాణానికి దాపురించిందని' సాధింపు మొదలుపెట్టింది భర్త కాని మరెవ్వరు కాని ఆమె అనారోగ్యాన్ని పట్టించుకోలేదు.

ఒకరోజు ఆఫీసులో కళ్ళు తిరిగి పడిపోయింది రేఖ. ఆమెతో పనిచేస్తున్న రీటా, సుశీలా ఆమెను హాస్పటల్‌కి తీసుకువెళ్ళి చూపించారు.

జ్వరం బాగా ఉందని మందులు రాసిచ్చి నాలుగు రోజులు రెస్ట్ తీసుకోమని చెప్పాడు డాక్టర్,

ఆమె చేత బలవంతంగా సెలవు పెట్టించి ఇంటికి పంపించారు.

రేఖ యింటికి వచ్చింది మొదలు ఆమె అనారోగ్యంగా ఉందని కూడా తెలుసుకోకుండా ఆమెచేత చాకిరీ చేయిస్తూనే ఉన్నారు పైగా అత్తగారు సాధిస్తూనే వుంది. వంటింట్లో కళ్ళు తిరిగి పడిపోయింది రేఖ.

'ఇదో దొంగరోగం పుట్టింటివారు ఉన్నా చచ్చినట్లే లెక్క' అంది అత్తగారు

'ఈ రోగంతో పీక్కుతినే కంటే ఒక్కసారి చస్తే పీడాపోతోంది' ఇంటికి ఆలస్యంగా వచ్చిన భర్త సాధింపు వినలేకపోయింది రేఖ.

ఆ రాత్రి జ్వరంతో ఉన్న రేఖ భర్త మాటలకి ఏడుస్తూనే ఉంది.

రేఖకు సవతి తల్లి తండ్రి మాట వినేరకం కాదు. అత్తగారికి మరింత నూరిపోసే రకం అతడు.

ఉద్యోగం చేసుకుంటున్న ఏ స్వాతంత్ర్యం లేని మనిషి రేఖ. జీతం అందగానే భర్త చేతిలో పొయ్యాలి. ఇంటిడి చాకిరీ చెయ్యాలి.

అనారోగ్యంగా ఉన్నప్పుడు ఉన్న ధైర్యం రేఖలో పోయింది. బాధలు పడలేక జీవితం మీద విరక్తి పుట్టింది. నిద్ర మాత్రలు పోగు చేసుకుంది. చావుతో తప్ప పోదనుకుంది. మాత్రలు మింగేసింది.

రేఖ కోరిక నెరవేరింది.

రేఖ సంగతి పూర్తిగా తెలిసిన శారద, లత వెక్కి వెక్కి ఏడ్చారు.

'రేఖ అత్త, ఆడపిడ్డ, భర్త నిజంగా నరరూప రాక్షసులే వారికి శిక్షపడాలి అనుకున్నారు.

ఏడుస్తూ శారద యింటికి తిరిగి వచ్చారు.

'ఏం జరిగిందే.

బ్యాంక్ రేఖ చచ్చిపోయిందట కదే' గుమ్మంలోనే ఎదురు వచ్చిన తల్లి అడిగింది.

'అవున్నమ్మా!' శారద మాట్లాడలేక కుర్చీలో వాలిపోయింది.

లత వెక్కి వెక్కి ఏడుపు మొదలు పెట్టింది.

'ఎందుకే అలా ఏడుస్తావు శారద ఉద్యోగం చేస్తూనే ఉంది కదే మరెందుకు చచ్చిపోయిందే' తిరిగి తల్లి ప్రశ్నించింది.

'ఉద్యోగం చేస్తున్నా, చదువుకున్న స్త్రీకి ధైర్యం రావడం లేదండీ! అసలు ఈ ఉమ్మడి కుటుంబాలే పోవాలండీ' అంది ఆవేశంగా లత.

'ముసలివాళ్ళు అయితే, అత్తగారు, మామగారు ఎక్కడికి పోతారే' తిరిగి ఆవిడే అంది.

'అవునండీ! అసలు స్త్రీకి ధైర్యం రావాలి. తన జీవితాన్ని తాను చక్కదిద్దుకునే శక్తి రావాలి. సమాజం ఆదరించాలి. స్నేహితులు, ఇరుగు పొరుగులు ఆదరించాలి ఆమె చావకుండా చూడాలి' లత సమాధానమిచ్చింది.

'ఇప్పుడు అందరూ ఉండి ఆమెను పట్టించుకోలేదు. రేపు పట్టించుకుంటారమ్మా?' లత తల్లి ప్రశ్నించింది.

'నిజమే ఆంటీ! పురుషులు ఎన్ని కష్టాలు వచ్చినా చావరుకదా, స్త్రీ చావడం తప్పే. ఆమె సంగతి ఎవరికీ చెప్పలేదు. కష్టాలు పలుగురికి చెప్పాలి. సాధన చూడాలి. తన బతుకు తాను చక్కదిద్దుకోవాలి. అత్తవారింటికి వచ్చింది, మొదలు, నలుగురుంటే నాలుగు పనులు చేసుకునేటట్టు చూడాలి" అంది లత.

'అన్ని కష్టాలుండుంటే స్త్రీ తెలివి తెచ్చుకోవాలి వేరుగా ఇల్లు చూసుకుని

వెళ్ళిపోవాలి లేదా ఏ లేడీస్ హాస్టల్‌కో మారాలి. లేదా ఏ స్నేహితురాలి సలహానో అడిగి జీవితం నరకం కాకుండా చూడాలి' కుర్చీలోంచి లేచి ఆవేశంగా పలికిన శారద 'ఈ ప్రచారం నేను చేస్తాను" అంది ధృఢంగా.

'నిజమే! శారదా ఇది మరో పరిష్కారం కావచ్చు' అంది ఆ తల్లి.

"ఎవరూ ఇంక చావకుండా చూడాలి" అంది లత.

—O—

# లాంఛనాలు

'వరకట్నాలే' కాదు నశించవలసినవి మగ పెళ్ళివారు జరిపించుకునే లాంఛనాలు, పుచ్చుకునే కానుకలు కూడా! ఇది యదార్థ విషయం. ఇందులో అతిశయోక్తి లేదు. ప్రస్తుత సంఘంలో బలంగా నాటుకున్న దురాచారాలివి.

ధనవంతులు వేడుకలకోరకై పెట్టుకున్న ఈ ఆచారాలు క్రమంగా లాంఛనాలుగా మారి సామాన్యులకు మోయలేని భారంగా తయారయ్యాయి. అన్ని విధాలా కలిగివున్న వాళ్ళ వేడుకలు జరపడంలోనూ, జరిపించుకోడంలోనూ నష్టం ఎవరికీరాదు. కాని మనం ఆలోచించవలసింది సామాన్యుల సంగతి.

ఒకపక్క వరకట్నం తీసుకుని మరోపక్క ఈ లాంఛనాలు జరపలేదు. ఆ లాంఛనాలు జరపలేదంటూ ఆడపెళ్ళివారిని చీదరించుకొనే పెద్దలు కొందరైతే మరోరకం పెద్దలు ఆదర్శవంతుల్లా కట్నం అక్కర్లేదంటూ వచ్చి పెళ్ళిలో లాంఛనాల కోసం గొడవ చేస్తారు. అలా ఆ వధువు తల్లి తండ్రులను ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగిస్తారు. వీరిని అదుపులో పెట్టటానికి ఈ వేడుకలను అరికట్టటానికీ ఏ చట్టాలు లేవనుకుంటాను? నిజం చెప్పాలంటే నాగరికత పెరిగినకొద్దీ ఈ లాంఛనాలు ఫాషన్‌గా పరిణమించాయి. పిల్లికి చెలగాటం ఎలుక్కి ప్రాణ సంకటంలా తయారయ్యాయి ఈ వేడుకలు.

అత్తగారికి, ఆడబిడ్డలకీ, లాంఛనాలు అడుగులకు మడుగులొత్తుతు జరపాలి ఇక వరుని సంగతి చెప్పనవసరంలేదు. పెళ్ళి రెండ్రోజులూ ఆకాశం నుంచి దిగి వచ్చామనుకుంటారు. పీటమీద కూర్చోడానికి కట్నాలు, పీటమీంచి లేవటానికి కట్నాలు, ఇలా ఏడిపిస్తారు ఆడపెళ్లి వారిని ఇవి కాస్త పొరపాటున లోవ ఏదైనా జరిగిందనుకోండి అత్తగారు ఆడబిడ్డలు మొదలు పెడతారు గొడవ లేక ఇందులో మధ్యవర్తులు కొందరు నారదుడిలాంటి వారు దొరికిన అవకాశాన్ని జారవిడుచుకోవడం దేనికని పుల్లలు పెట్టి అగ్ని ఆరిపోకుండా చేస్తారు. ఇలాంటి వారికి గట్టిగా బుద్ధి చెప్పే వాళ్ళుంటేనే తప్ప సంఘం బాగుపడదు. వీరు సంఘానికి చీడ పురుగుల్లాంటి వారనే చెప్పాలి. ఇంకా పెళ్ళికొడుకు దూరపు బంధువులకి మర్యాదలు సరిగా జరగలేదనీ, అలక పాన్పులు, మాటి మాటికి కాఫీలు, టిఫిన్లు, సిగరెట్లు, అవసరమైతే మత్తుపానీయాలు అడిగిన వెంటనే సప్లయి చెయ్యాలి. లేక పోతే అరుపులు, కేకలు, బొబ్బలు ఒకటేమిటి గందరగోళం! పాపం ఆడ పెళ్ళి వారు ఇల్లు, వాకిళ్ళు అమ్ముకున్నా అప్పులు తీరవు.

ఒకపక్క ఆడపిల్ల తల్లిదండ్రుల్ని పీడిస్తూ కానుకలు పుచ్చుకుంటూ, మరో పక్క 'మా అబ్బాయికి అత్తవారు ఇవి పెట్టారు. మాకవి పెట్టారంటూ తమ

గొప్పతనం వల్లనే అవన్నీ జరిపారని చాటుకునే ఆడవాళ్ళు ఎంతోమంది ఉన్నారు ఇక ఇంతకంటే నిర్మొహమాటంగా పెళ్ళికి ముందుగానే 'లిస్టు' రాసి ఆడపెళ్ళి వారికి పంపే ఘనులు కొంతమంది

ఎలాగోలా పెళ్ళి జరిపించారనుకోండి. ఆడ పెళ్ళివారి ప్రాణానికి వెంటనే పండగలొచ్చి పడతాయి. బంగారం పెడితేకాని పండక్కి రానని బిగుసుకునే అల్లుళ్ళు, పంపమనే వియ్యాలవారు, ఇకపోతే ఈ కోరికలు రకరకాలు-ఇస్త్రీపెట్టె దగ్గర్నుంచి సైకిళ్ళు, రేడియోలు, గాస్ పొయ్యిలు, స్కూటర్ల వరకూ! ఇవిగాక కొత్తగా టి.వి. వచ్చిపడింది. ఇక అత్తలకి, ఆడబిడ్డలకి టెరిలిన్ చీరలు, పట్టు చీరలు, (అప్పటికి ఏ ఫాషనుంటే అవిలెండి) పెడితేకాని కదలమనే వాళ్ళే ఎక్కువ! ఇవి సరిగ్గా జరక్కపోతే అమ్మాయిని అత్తవారింటికి తీసుకు వెళ్ళమనే వారు కొందరు. అమ్మాయిని పుట్టింటికి పంపమనే వారు కొందరు. ఇవిగాక అమ్మాయి వెంటనే నీళ్ళు పోసుకుందనుకోండి! ఇక సూతిరలు, బారసాలలు మగ పెళ్ళివారు కోరినట్లే జరపాలి.

ఇలా రావలసినవన్నీ కక్కించి నిర్మొహమాటంగా జరిపించుకుంటూ ఆడపిల్లకు పెట్టవలసిన చోట ఆచారం లేదంటూ తప్పించుకుంటారు పాపం ఆడపెళ్ళి వారికి ఒళ్ళుమండి అడగాలని వున్నా కూతురు కాపురం ఎక్కడ చెడిపోతుందోనని ఆ కోపాన్ని పగనీ మనస్సులోనే వుంచుకుంటారు.

ఇందులో చిత్రమేమిటంటే ఇవన్నీ స్త్రీలకు సంబంధించిన వేడుకలే ఇందులో పురుషుల పాత్రకంటే స్త్రీల పాత్రే ఎక్కువగా కనబడుతోంది. ఇలా స్త్రీ జాతి ఒకరిని ఒకరు అవమానించుకుంటూ ఉండటం అవివేకం. అలా అడగటానికి పుచ్చుకోడానికి కొంచెమైనా అభిమానంలేదు సరికదా కనీసం ఆ దివాళా తీసిన వియ్యాలవారి మీద సానుభూతి కూడా లేకుండా వారిని అప్పులపాలు చేసి ఆనందించే ఆ పెద్దలను ఏవిధంగా అదుపులో పెట్టాలో మీరే ఆలోచించండి.



# అమ్మాయి అప్సరసలా ఉండాలా?

ఆడవాళ్ళు అందానికి వారసులు కావాలని తమ కంటికి అజంతా బొమ్మలా కనబడాలని గుండెలనిండా ఆశ పాపం మగవాతికి. అసలు అందమంటె యిష్టం లేంది యెవరికి చెప్పండి? అందులోను అతి తెలిగ్గా చేతికి అందుతుంటె అందు కోవాలని ఎవరికి ఉండదు? తాము అష్టవక్రంగా, పక్కని భార్యమటుకు వాడని గులాబీలా వుండాలి? నలగని ఇస్త్రీ మడతలా ఉండాలి.

అందరూ అందంగానే ఉండాలి అంటే అది మనకు సాధ్యపడే విషయ మేనా? కట్న కానుకలకు సాయం, నేడు ఇదో పెద్ద సమస్యగా ఉంది. పెళ్ళీ డొచ్చిన అమ్మాయిలకు వారిని కన్న తల్లితండ్రులకు అమ్మాయిల జనాభా ఎక్కు వగా కనబడటమే కాకుండా వారి ఆర్థిక స్థితిగతులను కూడా అసరాగా తీసు కొని వారిని పీల్చి పిప్పి చేస్తున్నారు. అబ్బాయిలు వారి తల్లితండ్రులు.

అప్పో, సొప్పో చేసి పిల్లలకు పెళ్ళి చేద్దామంటే అమ్మాయి నచ్చలేదంటూ చెప్పే గోల పెద్ద అగాధంలా కనబడుతోంది. అమ్మాయి ఉద్యోగం చెయ్యాలి కట్నమివ్వాలి. అందంగా ఉండాలి. మొదటివి రెండు ఎక్కడైనా సంపాదించ వచ్చును. కాని అందం ఎక్కడ నుంచి తెచ్చేది? అందరూ సినిమా స్టార్సుల్లా కనపడలేరు కదా! ఎక్కడో నూటికి కోటికి ఉంటారు. తన అందం చూసుకుని అమ్మాయిని సెలక్టు చేసుకునేవాడు. అందరు అలా ఉంటే సమస్యే లేదు కదా।

పోనీ అందంగా అబ్బాయి ఉంటే తప్పకుండా అందమైన భార్య కావాలన డంలో ఆశ్చర్యమేమీ లేదు. కాని ప్రతివానికి అందమైన భార్య కావాలనుకోడం, ఏదో కారణంచెప్పి ప్రతి పిల్లను చూసి తిరస్కరించడం కూడా పెద్ద ఘన కార్యంలా చెప్పుకుంటున్నారు.

అమ్మాయి సాంప్రదాయం, ఇచ్చే కట్నం, చదువు సంధ్యలు, ఫోటో యిస్నీ సేకరించడం అక్కడనుండి పెళ్ళిచూపులకు బయలుదేరడం, ఎక్కే గుమ్మం, దిగే గుమ్మం, అలా ఎక్కి దిగటానికి అభిమానం ఏ మాత్రం అడ్డు వస్తూన్నట్టు కనపడ్డంలేదు.

అసలు అమ్మాయిలకు కూడా ఒక మనస్సు ఉంటుందని ఆమెకు కూడా కొన్ని కోరికలు, కొన్ని అభిప్రాయాలు ఉంటాయని ఎందుకనుకోరో తెలీదు? బాగా అందంగా వున్న అమ్మాయి అనాకారి భర్తను కోరుకుంటుందంటారా? ఒకవేళ ప్రాప్తమయితే ఆ పిల్లకది సంతోష మంటారా? ఇంట్లో పరిస్థితులకు తలవంచి ఆ పిల్ల బలవంతంగా సరిపెట్టుకోక ఏంచేస్తుంది? ఆ జంటను పెళ్ళి పీటలమీద

చూసిన జనం 'కాకి ముక్కుకు దొండపండు' అనడం, రోడ్డుమీద ఆ జంట వెదు తోంటె వెక్కిరించడం మనం చూస్తూనే ఉంటాం. పాపం అబ్బాయిల చెవులకవి వినబడవు కాబోలు.

ఒకసారి మా చుట్టాలింటికి పెళ్ళి కెళ్ళాం, పిల్ల చక్కని చుక్క. పిల్లి వాడంటారా? బొగ్గుల బస్తామీద పిడత బోర్లించినట్టున్నాడని మొహం మీదే అంటున్నారు. జనమంతా ఆ పిల్ల ఎంతో చిన్నబుచ్చుకుంది. పీటలమీంచి లేచిన తరువాత అడిగితే మసి బొగ్గుల పూజ చేస్తే ఇలాటి భర్తే దొరుకుతాడు కాబోలు" అంది కన్నీళ్ళు పెట్టుకుంటూ. ఇప్పటికీ ఆ పిల్ల బాధ పెడుతూనే ఉంటుంది.

కాని వినుగెత్తితే అమ్మాయి తలిదండ్రులు కూడా ఎదురు తిరుగుతారు. ఈ మధ్య మాకు తెలుసున్న వాళ్లింటి కెళ్ళాం. వాళ్ళ పిల్లకు పెళ్ళి సంబంధం చూస్తున్నారు. అబ్బాయి తండ్రి దగ్గరినుంచి వచ్చిన ఉత్తరం నా చేతిలో పెట్టారు అది నాలుగు పేజీల ప్రశ్నాపత్రం అంటే సరిపోతుంది. ముచ్చటగా మూడు ప్రశ్నలు రాస్తాను.

ఈ క్రింది ప్రశ్నలకు కరక్టుగా సమాధానం వ్రాయండి.

1. రగు

ఎ. తెలుపు బి. బాగా తెలుపు సి. చామనచాయ

2. పొడుగు

ఎ. నార్మల్ బి బాగా పొడుగు సి. పొడుగే

3. అందం

a. Fair b. Beautiful c. Good Looking,

ఇందులో సమాధానాలకు సరిపడేలా పిల్ల ఉండాలి. ఆలోచించి జాగ్రత్తగా వ్రాయండి. లేకపోతే మీ మర్యాద రోడ్డు ఎక్కిస్తాను.

ఇలా 32 ప్రశ్నలున్న ప్రశ్నా పత్రమిది. పాపం ఎన్నిరోజులు పట్టిందో ఆ తండ్రిగారికి. అంత చదువుకున్నా ఆ కొడుక్కి కూడా కొంచెం ఇంగిత జ్ఞానం ఉన్నట్టులేదు. టైపు చేయించి సిద్ధంగా పెట్టుకున్నట్లున్నాడు. వీటికి సమాధానం రాయడం చేతకాని ఆ పిల్ల తండ్రి వారికో నమస్కారం పెట్టి సంబంధమే వదులు కున్నాడు.

ఈ మధ్య ఒక అబ్బాయి తల్లిదండ్రులు చక్కటి అమ్మాయిని చూసి అన్నీ మాట్లాడుకొచ్చారు. అబ్బాయి అమ్మాయిని చూడలేదు. అమ్మాయి అబ్బాయిని

కూడా చూడలేనట్టే కదా! పాపం పిల్లని చూపించి ముహూర్తం పెట్టుకోవచ్చని కొడుకుని తీసుకుని బయలుదేరాడు తండ్రి. ఆ అమ్మాయిని చూసిని ఆ అబ్బాయి చూపు మరల్చుకోలేక ఉబ్బితబ్బిబై ఆనంద లోకాల్లో విహరిస్తూ 'వెంటనే ముహూర్తం పెట్టించేయండి నాన్నగారూ' అంటూ గావుకేక పెట్టాడు. ఆ కేక విని కర్తవ్యం గుర్తుకొచ్చిన ఆ అమ్మాయి "అబ్బాయి మరీ పొట్టి. నాకీ సంబంధం నచ్చలేదు నాన్నగారూ' అంటూ మెరుపులా లోపలికి వెళ్ళిపోయింది. ఆ మాటలు విన్న అబ్బాయి, తండ్రీ అసలు కుర్చీలోంచి లేచి వెళ్ళపోవడమే మర్చిపోయారు. ఆ అమ్మాయి తండ్రి వచ్చి 'ఇక మీరు వెళ్ళవచ్చు' అన్న తరవాతే చెప్పులు వెతుకున్నారు.

ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో సంఘటనలు ఒక్కొక్కప్పుడు అందరిని కాదంటూపోయిన వారికి వయస్సు మీరడం ఎవరో ఒకరు పిల్లనిస్తే చాలనుకుని పెళ్ళి చేసుకున్న సంఘటనలు ఎన్నో ఉన్నాయి. వీటన్నిటికి సాయం 'రాజును చూసిన కళ్ళని మొగుణ్ని మొత్తబుద్ధి అయింది.' అన్న సామెత లోకంలో అనాదిగా ఉండనే వుంది. ఈ అబ్బాయిలంతా వీటిని ఎందుకు నెమరు వేసుకోరో.

ఇలాటి షాకులు మరి కొందరికైనా తగలాలి కాబోలు. చదువు, సంస్కారం అన్నీ కొట్టుకుపోతున్నాయి యిలాటి కోరికలతో. మరి ఎప్పటికైనా తమని తాము పరిశీలించుకొని అమ్మాయిలను చూడటానికి బయలుదేరుతారని ఆశిద్దాం. అది త్వరలోనే ఫలించగలదని నమ్ముదాం.



# ఉద్యోగినికి కూడా ఆర్థిక స్వాతంత్ర్యం లేదా?

ఆధునిక సమాజంలో స్త్రీ ఎన్నో రంగాల్లో ముందంజ వేస్తోంది. మగ వారితో సమానంగా హక్కులు సంపాదించింది. కాని తరచి చూస్తే ఆచరణలో ఇంకా బారెడు వెనక్కే వున్నాయి అన్ని హక్కులూ.

కొడుకులతో సమానంగా ఆస్తి పంచి యివ్వరు సరికదా మరికొందరు చదువు చెప్పించడానికి యిష్టపడరు. ఆ చదువుకయ్యే ఖర్చుపెట్టి పెళ్ళిచేసి ఒక అయ్య చేతిలో పెడితే బాధ్యత తీరుతుందనుకుంటారు.

కొడుకుతో సమానంగా ఆస్తి పంచిపెడితే కూతురు కర్మకాండ చేస్తుందా? ఈ రెండు జరగని విషయాలే అయినప్పుడు ఆస్తి పెంపకమెట్లా చేస్తారు? మరి ఆస్తి పంచుకొన్న కొడుకులు, కోడళ్ళు ఆ ముసలివారిని చూస్తున్నారా? ఆదరిస్తున్నారా? ఆస్తులను పంచుకొంటున్నారు కాని కొడుకుకంటే కూతురికే తల్లితండ్రుల మీదే అపేక్ష ఉంటుంది అనడం అందరూ ఒప్పుకున్న విషయమే కూతురు విషయంలో అంతా భేదం చూపిన ఆ తల్లిదండ్రులు బాపుకునేదేమిటో? తమ కొడుకులు మంచివారవుతారన్న ధీమా కాబోలు. కనీసం కర్మకాండ చేస్తారన్న ఆశ కాబోలు. ఆస్తి పరపతిని పెంచి వంశ గౌరవాన్ని వదిరెట్లు చేస్తారన్న కోరిక కాబోలు.

సంపాదకురాలై యే ఇబ్బందులు లేని స్త్రీకి ఆస్తి వాటాతో పనిలేదు. కాని అత్తవారింట్లో అష్టకష్టాలు పడుతూ రక్షించమని అడిగితే కూతురికీ దుర్మార్గుడైన లేక అసమర్థుడైన భర్త చేతిలో నలిగిపోయే స్త్రీకి పుట్టింటి ఆస్తి, అండ చాలా అవసరం. ఎక్కడ ఖర్చు అవుతుందోనని భయపడి ఆ స్త్రీని వదిలివేసే పుట్టింటి వారు నేటి కాలంలో యింకా ఉండటం ఆశ్చర్యంకదూ, అయితే నేడు ఎంత మందికి ఆస్తులున్నాయి అని ఆలోచిస్తే లేనివాళ్ళే ఎక్కువ, లేనివారైన ఆమెను ఆదుకొని యే కూలి నాలో చేసి బ్రతుకు వెళ్ళ తీసుకునే యేర్పాట్లు చెయ్యడం ధర్మం కదా!

మొన్న మాకు తెలిసిన ఒకామె అత్తింట్లో నానా యిబ్బంది పడుతోంది. తల్లిదండ్రులకు తెలుసు తెచ్చి యింట్లో పెట్టుకుంటే సమాజంలో పరపతి తగ్గిపోతుంది. రెండవది కొడుక్కి యిచ్చే వాటా కరిగిపోయింది. చూసి చూడనట్లు వదిలివేశారు. ఫలితం బాధలు పడలేక కిరసనాయిలు పోసుకుని అంటించుకుని ఆత్మహత్య చేసుకుంది. ఇవన్నీ సంపాదించలేని స్త్రీల సంగతులుకదా! మరి ఉద్యోగాలు చేస్తున్న స్త్రీల సంగతులు కూడా ఒక్కసారి ఆలోచించాలి. ఉద్యోగాలలో ఉన్న

అమ్మాయే కావాలి? నేడు ఇదొక ఆదర్శ నినాదం అబ్బాయికి అంతవరకు చాలా బాగుంది. పెళ్ళి చెయ్యలేక నానా ఇబ్బందులు పడుతున్నా ఆ పిల్లతండ్రులు మహా సంతోషంతో అమ్మాయికి పెళ్ళిచేస్తారు. కొత్తలో కొన్నాళ్ళు మోజు బాగానే ఉంటుంది. తరవాత సంగతి?

మా ఎదురింట్లోనే ఉద్యోగం చేస్తున్న కోడలు అత్తింట్లోకి కాపురాని కొచ్చింది. ఫస్టు రాగానే అందిన జీతమంతా భర్తగారి చేతిలో పెట్టాలి, ఆయన గారు బస్సు ఛార్జీలకు ఆమె చేతిలో పెట్టి మిగిలినది ఆయన పర్సులో పెట్టు కుంటాడు. పాపం కాఫీ తాగుతామన్నా చేతిలో డబ్బు లేదు. ఆ సంపాదకురాలికి ఆయనగారికి స్కూటరు, ఫ్రెండ్సు, హోటళ్ళు సినిమాలు ఎన్నెన్నో కాలక్షేపానికి ఈవిడ ఆఫీసు వదలగానే బస్సుస్టాపుకు పరుగు, ఇంటికిరాగానే వంటింట్లోకి పరుగు ఆ ఉద్యోగిని సుఖాన్ని ఏమని రాయమంమంటారు?

ఇంక నా స్నేహితురాలు మరోకామె సంగతి చూడాలి. ఇద్దరూ మంచి సంపాదకులే. సంపాదనలో మిగిల్చి స్థలం కొన్నారు. ఇంట్లో సామాన్లు కొన్నారు. చిట్‌ఫండు కట్టారు. ఇన్సూరెన్సు చేశారు. ఎవరిపేరున ఉంటేనేమి ఇద్దరూ ఒక్కటే అందుకని అన్నీ ఆయన పేరే పెట్టుకున్నాడు. నాలుగేళ్ళు గడిచింది. ఆయనగారి జీవితంలో మరో స్త్రీ ప్రవేశించింది. మరి ఈవిడగారి సంగతి! చిప్పా కట్టా కూడా చేతిలో పెట్టకుండా బయటకు నెట్టాడు? ఆవిడ కష్టాలను రాయా లంటేనే భయం.

మరి స్త్రీ ఎంత సంపాదించుకుంటున్నా ఆయన గారితో చెప్పకుండా మల్లె పూలు కూడా కొనుక్కోడానికి వీలుకాదంటే ఆ స్త్రీ ఎంత సుఖపడుతోందో వేరే చెప్పనవసరం లేదు. చదువుకున్నా, చదువుకోకపోయినా సంపాదిస్తున్నా, సంపాదన లేకపోయినా స్త్రీ ఎన్నో కష్టాలు పడుతూనే ఉంది. మరీ కష్టాలు తొలగాలంటే స్త్రీ కాస్త మానసికంగా బలాన్ని సంపాదించాలి. చదువుకున్న జ్ఞానాన్ని నిత్య జీవితంలో వినియోగించుకోవాలి. ధైర్యంగా నిలబడే బలాన్ని పుంజుకోవాలి. అప్పుడే స్త్రీపై చిక్కు సమస్యలను పరిష్కరించుకోగలుగుతుంది,

—0—

# స్త్రీలు కూడా సంపాదిస్తేగాని గడవదు

చదువులు కేవలం ఉద్యోగాలకోసమే అనే అపోహ తొలగిపోవాలి. చక్కని యూనిఫారం ధరించి స్కూళ్ళకు పోయే ఆడపిల్లలు క్రమశిక్షణనూ, విజ్ఞానాన్నీ సంపాదించేది భావిజీవితాన్ని చక్కదిద్దుకోడానికే!

చదువుకున్న ఆడపిల్లలంతా ఉద్యోగాలు చెయ్యాలని ఎక్కడా లేదు. అవసరం లేదు కూడా! చదువుకుంటున్న ఆడపిల్లలో సగం మంది కూడా ఉద్యోగాలు చెయ్యడం లేదన్నది వాస్తవం।

ఈ కాలంలో ధరలన్నీ ఆకాశానికి ఎదిగిపోతున్నాయి. నెల జీతం అందుకుని ఇంటి అద్దె, బియ్యం కొనేసరికి చేతిలో పైసా లేకుండా ఖర్చవుతోంది. ఇంక నెల గడిచేదెట్లా? పెరిగే ధరలలో పదవ వంతు కూడా జీతాలు పెరగడం లేదన్నది యదార్థం!

అందుకనే ఎంతోమంది యువకులు ఉద్యోగంలో ఉన్న ఆడపిల్లల్ని పెళ్ళిళ్ళు చేసుకోడానికి ముందుకొస్తున్నారు. పెళ్ళి ముందున్న మోజు పెళ్ళయినతరువాత భార్యభర్తలలో తగ్గడం సహజం. ఉద్యోగస్తురాలైన భార్యకు ఇంటిపనుల్లో కాస్త సహకరించడం భర్త ధర్మమే. కాని చిన్నతనం నుంచీ పురుషుడు స్త్రీ కంటే ఆధిక్యతతో పెంచబడ్డంవల్ల భార్యమీద అజమాయిషీ చెయ్యాలనుకునే మగవారు కొందరున్నారు.

మరికొందరు ఇంట్లో భార్యకు అన్నివిధాలా సహకరిస్తూ పైకి అందరి ఎదుటా, అధికారం చెలాయించడం అవసరం అనుకుంటారు.

మరికొందరు భార్య సంపాదిస్తోందికదా మనకెందుకు? ఇంటి సంగతులు అనుకోవచ్చు. గయ్యాళి గంపల్లాంటి నారీమణులూ ఉన్నారు. ఇవన్నీ స్త్రీ పురుషులలో తగిన సంస్కారంలేకననే చెప్పాలి.

అంతేకాదు, కొత్తగా స్త్రీలు ఉద్యోగాల్లో ప్రవేశించినప్పుడు కాస్త ఒడుదుడుకులూ, ఆటంకాలూ ఉండవచ్చు. క్రమంగా భర్తగారు వాటిని అలవాటు చేసుకొని భార్యతో సహకరిస్తాడు కుటుంబ విషయాలలో.

రంగురంగుల దుస్తులలో సీతాకోక చిలుకల్లా ముస్తాబై స్కూళ్ళకూ, కాలేజీలకూపోయే ఆడపిల్లలందరి జీవితాలు అలాగే సాగిపోతాయన్నది కల్ల! అయినా మధ్య తరగతి కుటుంబాల్లోని పిల్లలకు కాస్త కష్ట సుఖాలు వంటబట్టేటట్టు

పెంచడం తల్లితండ్రుల ధర్మంకూడా। పిల్లలకు ఏమాత్రం ఇంటివిషయాలు తెలీకుండా తాహతుకుమించి పెంచితే వారికి భావి జీవితంలో ఎదురయ్యేవి కష్టాలే!

అన్నివిధాలా పురుషునితోపాటు హక్కులు కావాలనుకొని పోరాడే వీర నారీమణులు ఆర్థికంగా వెనకబడి ఉన్నప్పుడు ఉద్యోగంచేసి భర్తకు చేయూత నియ్యడం ధర్మం. చాలీచాలని జీతంతో కడుపునిండుగా భోజనంలేక అలసిపోయే పురుషులెందరో వున్నారు. అటు ఆఫీసర్ల చేత చివాట్లు తింటూ, ఇటు భార్య కోరికలు తీర్చలేక బాధలుపడే పురుషులెందరో. అంతేకాదు. ఇంట్లో ముసలి తల్లిదండ్రులు, చదువులు చెప్పించవలసిన తమ్ముళ్ళు, పెళ్ళిళ్లు చేయవలసిన చేయవలసిన చెల్లెళ్ళు ఉన్నవారు కూడా ఉన్నారు.

మరి భర్తలొదిలేసిన అక్కచెల్లెళ్ళు, చదువులురాని తమ్ముళ్ళు ఉన్నవారు మరెందరో? మరి వచ్చే జీతంతో అందరినీ పోషించే శక్తి ఎందరి పురుషులకుటుందో ఒక్కసారి గుండెమీద చెయ్యివేసి ఆలోచించుకుంటే అందరికీ తెలుస్తుంది. అటువంటప్పుడు చదువుకుని సంస్కారవతియైన స్త్రీ ఇంటి పనులు చేస్తూ కూర్చోగలదా? చంటిపిల్లవాణ్ని ఒళ్ళో వేసుకుని నిద్రపోగలదా?

అయినా అసలీకాలంలో పిల్లలకు పాలిచ్చే తల్లులెవరున్నారు? పిల్లలకు పాలివ్వడానికి ఉద్యోగినులకు కుదరకపోతే మరి మిగిలిన వారి సంగతేమిటి? ఇంటిదగ్గర స్థిమితంగా ఉండేవారెందరో ఫేషన్ల పేరుతో పిల్లలకు పాలివ్వడం ఎప్పుడో మానివేశారు! అసలు ఇంతకీ మునపటిలా పాలున్న బాలింతలెందరు? ఇవన్నీ ఆలోచిస్తే ఉద్యోగినులే పాలివ్వడంలేదని వాపోవలసిన అవసరంలేదు. ఉద్యోగాలు లేకపోయినా అంతకంటే పెద్ద ఉద్యోగాలు కల్పించుకొని పిల్లల్ని పక్కవాళ్ళకూ. పనివాళ్ళకూ అప్పచెప్పి షికార్లు పోయే నారీమణులెందరో?

మరికొందరు పక్కింటివారితో కబుర్లో లేక నవలాపఠనంలోనో మునిగి ఇంటిని పిల్లల్నీ మరిచిపోతారు. ఈ లక్షణాలన్నీ కేవలం ఉద్యోగినులకే అంటగట్టుకుని అనవసరంగా బెంగ పెట్టుకోవలసిన అవసరంలేదు.

అయినా స్త్రీ అసలెప్పుడు సుఖపడిందని? పాత పద్ధతుల్లో ఉండే కష్టాలను తొలగించటానికి స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యం కలిగి ఉండాలని పట్టుపట్టారు ఇప్పుడు ఈ కాలంలో అనేక మార్పులొస్తున్నాయి. అయినా స్త్రీ తనకోసం కాకుండా ఎప్పుడూ కుటుంబంకొరకే కష్టపడుతోందన్నమాట నిజం! నేడు కూడా అంతే. ఇద్దరూ సంపాదిస్తేకాని గడవని రోజులివి. యూనిఫారం డ్రస్సుల్లో హాయిగా స్కూళ్ళకు పోయే పిల్లలు పెరిగి పెద్దవారై వారి కుటుంబాలను మరింత చక్కగా దిద్దుకోడానికి ప్రయత్నిస్తారని ఆశిద్దాం.

—o—

# ఉద్యోగం స్త్రీ లక్షణం కాదా?

'ఉద్యోగం పురుష లక్షణం' అన్నారు ఒకనాడు. మరి పురుషులతో సమానంగా నేడు స్త్రీలు కూడా ఉద్యోగాలు చేస్తున్నారు కదా! మరి ఇప్పుడు 'ఉద్యోగం స్త్రీ లక్షణం' అంటే బాగుంటుందనిపిస్తోంది.

నేడు కేవలం పురుషుని సంపాదనమీద ఆధారపడ్డ సంసారాలే ఎక్కువగా ఉన్నాయి. ఒకనాటి ఆస్తిపరులు నేడు సామాన్య స్థితికి దిగజారి ఉద్యోగాలమీద ఆధారపడి బ్రతుకుతున్నారు. వెనక ఆదాయం లేనప్పుడు పురుషుడు ఉద్యోగం చేసి కుటుంబాన్ని పోషించవలసి ఉంది. అది వాని ధర్మం, కర్తవ్యం.

మరోపక్క ఆలోచిస్తే పురుషుడు కుటుంబ పోషణకు మాత్రమేగాక ఉద్యోగం చెయ్యడం తన డిగ్నిటీని నిలబెట్టుకోడానికని కూడా అనిపిస్తుంది. చదివి ఇంట్లో కూర్చుంటే ఉన్నది మర్చిపోడమేగాక దురభ్యాసాలకు లోనవుతారు కూడా. అయినా ఇంట్లో ఏం పనులున్నాయని చెయ్యడానికి? కాలక్షేపమెట్లా? అందుకే ఉన్నవారు, లేనివారు కూడా ఉద్యోగాల్లో చేరుతున్నారు. వెనక పెద్ద ఆస్తులున్నవారు, వ్యాపారాలున్నవారు వాటిని ఒదిలి పట్నాలకొచ్చి ఉద్యోగాలు చేస్తున్నారు. చదువుకున్న తన జ్ఞానంతో వ్యవసాయం కాని, వ్యాపారంకాని చేస్తే ఆదాయం రెట్టింపు అవుతుందన్న సత్యం అందరికి తెలిసిందే. దీనినిబట్టి పట్నాలలో ఉద్యోగం చేస్తే గొప్పన్న భావం వారిలో పెరిగిందన్నమాట!

వీటికి వెనక వీరి ఆడవాళ్ళ చెయ్యి కూడా ఉంది. ఉమ్మడి కుటుంబాలలో ఉంటే చాకిరీ చెయ్యాలి అని భయపడ్డవారు, పల్లెలో ఉంటే ఫేషన్లకు, సినీమాలకు ఛాన్సు ఉండదని తలచిన వారు భర్తలకు నచ్చచెప్పి పట్నాలకు లాక్కుపోతారు. అదేకాక వ్యవసాయంలో, వ్యాపారాలలో వచ్చే కష్ట నష్టాలను భరించే శక్తి లేక కూడా వానిపై మోజుతగ్గి నెలకి ఆదాయం జేబులో పడుతుందని కూడా పురుషులు ఉద్యోగాలపై మోజు పెంచుకున్నారు.

ఈ విధంగా పురుషులలో మొదట వ్యాపించిన ఈ ఉద్యోగ లక్షణం క్రమంగా చదువుకున్న స్త్రీలలో కూడా వ్యాపిస్తుంది. కొందరి స్త్రీలలో కూడా చదువుకోడం కేవలం ఉద్యోగానికే అన్న భావం కూడా స్థిరపడిపోతోంది. పురుషులను 'ఎక్కడ పనిచేస్తారు' అని అడిగే అలవాటున్నవారు స్త్రీలను కూడా 'మీరెక్కడ పనిచేస్తున్నారు' అని అడగవలసిన అవసరం కనబడుతోంది స్త్రీలకు ఇంతగా ఈ కోరిక రావడానికి కారణం కేవలం సంపాదన మోజేగాక ఇంటి పనులు చేయడం భారమని తలంచి ఉద్యోగంచేసి స్వేచ్ఛగా బ్రతకాలన్న కోరిక

భర్త చే వదలివేయబడ్డవారు, భర్త చనిపోయినవారు, చూసే దిక్కులేని వారు ఉద్యోగం చేసుకుని బ్రతకవలసిన అవసరం ఏర్పడింది. అంతేకాదు తల్లి తండ్రులను చూడని కొడుకు లున్నప్పుడు స్త్రీ ఉద్యోగం చెయ్యడం వారిని పోషించడం చాలా ముఖ్యం. అయినా పురుషునితో సమానంగా ఆస్తిలో వాటా అందుకునేందుకు అర్హతలున్న స్త్రీలు తల్లితండ్రులు చూడవలసిన బాధ్యత కూడా ఉందనటం అతిశయోక్తి కాదు.

కాని ఏవిధమైన అవసరాలు లేని ధనవంతుల పిల్లలు ఎంతోమంది ఉద్యోగాలలో చేరుతున్నారు. వారు ఉద్యోగం చెయ్యడం కేవలం సంపాదనకనడానికి వీలులేదు. ఇంత చదువు చదివి ఇంట్లో కూర్చుంటే ఏంతోచదు అంటారు. అది సమంజసమే, వారికి ఇంట్లో నౌకర్ల మూలాన చేసే పని ఉండదు. పైగా ఇంటికి వచ్చిన వారితో ఇరుగు పొరుగులతో మాట్లాడే అవసరం అంతకంటే ఉండదు. అసలు వారే అన్నివిధాల తగినవారనిపిస్తుంది ఉద్యోగం చెయ్యటానికి.

మరి మధ్యతరగతి కుటుంబాలలో భర్తకి సాయం భార్య కూడా ఉద్యోగం చేస్తే సంసారం రెట్టింపు ముందుకు వస్తుంది. అంతేకాదు భర్తకు వెనకాల తల్లి తండ్రులను పోషించడం, అక్క చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు చెయ్యడం, తమ్ముళ్లకు చదువులు చెప్పించడం మొదలగు బాధ్యతలు ఎన్నో వుంటాయి-అవన్నీ ఒక పురుషుడివల్ల సాధ్యంకావు కమక-భార్య కూడా ఉద్యోగం చేసి సంపాదిస్తే-కుటుంబం సౌఖ్యంగా ఉంటుంది.

చదువుకోడం విజ్ఞానం కోసమే అయినా అవసరాన్నిబట్టి ఆ చదువుని ఉపాధికోసం వినియోగించుకోవటంలో తప్పులేదు. కొన్ని సమయాలలో స్త్రీ చదువుకోనిదై అనగా ఉద్యోగానికి పనికి వచ్చేటంతగా చదువుకోకపోవచ్చును. అప్పుడు-తనకి తెలుసున్న ఏ కుటీర పరిశ్రమనో చేసి సంపాదించవచ్చును. అలాంటివారు సాధారణంగా మధ్యతరగతి కుటుంబాలకి క్రింద స్థాయిలో ఉంటారు

భర్త సంపాదనతో ఇల్లు గడవనప్పుడు భార్య కూడా సంపాదించటంవలన సంసారం సుఖంగా నడుస్తుంది. అందుకే కూలి నాలి చేసుకునే శ్రమ జీవుల్లో స్త్రీ, పురుషులు ఇరువురూ కష్టపడి సంపాదిస్తూనే ఉంటారు.

అందుచేత ఉద్యోగం చేయటం అనేది పురుష లక్షణమే అనుకోనక్కర్లేదు అవసరాన్నిబట్టి-స్త్రీ కూడా ఉద్యోగం చేస్తోంది! చేయాలి!

ఇక అవసరం లేకపోయినా ఉద్యోగాలు చేసే స్త్రీలు ఒక నిష్ఠూరంపడాల్సి వస్తోంది. వాళ్ళు మిగతావారికి అడ్డు వస్తున్నారని! కానీ ఈ వాక్యం పురుషులకి మాత్రం వర్తించదా? గొప్పింటివాడు ఉద్యోగం చేయటం లేదా? అప్పుడు సమాజం ఏమీ విమర్శించదు. ఎందుకంటే— మొదట్నుంచీ పురుషుడే ఉద్యోగం చేస్తున్నాడు గనుక!

కానీ ఈ భావం సనాతనమైనది. ఈ నవ నాగరీకమైన సమాజంలో-స్త్రీ కూడా అభిలాష-అవసరాన్నిబట్టి ఉద్యోగం చేయటమే సమంజసం! అలా చేస్తున్న వారూ ఉన్నారు గనుక ఉద్యోగం స్త్రీ లక్షణం అని కూడా అనుకుందాం!

# స్త్రీకి సమయస్ఫూర్తి చాలా అవసరం

ప్రతి మనిషికి జన్మతః తెలివితేటలు వస్తాయి. జ్ఞానం వచ్చిన తరువాత లోకాన్ని చూసి మరింత పెంచుకుంటాడు,. తెలివితేటలకు స్త్రీ పురుషుల తారతమ్యముండదు. కాని సమాజ పరిస్థితిని బట్టి, పుట్టి పెరిగిన వాతావరణాన్ని బట్టి కొంత బేధం కనపడుతుంది. పురుషుడంత ధైర్య సాహసాలు స్త్రీ ప్రకటించలేక పోతుంది. ఎవరైనా రౌడి మీద పడితే, పురుషునిలా స్త్రీ వానిని ఎదిరించేవానిని తన్నలేకపోవచ్చును. కొట్ట లేకపోవచ్చు. కాని అంతమాత్రంచేత స్త్రీ అబలని,అసమర్థురాలని అనవలసిన అవసరంలేదు. ఎదైనా అపాయం కలిగినప్పుడు స్త్రీ తగిన ఉపాయం ఆలో చించి తప్పించుకునే శక్తిని అలవాటు చేసుకోవాలి అది చాలా అవసరం కూడాను. స్వాతంత్ర్య సమరంలో పోరాడిన స్త్రీలు ఉన్నారు. యుద్ధాలు చేసిన స్త్రీలు ఉన్నారు. దేశాలు పాలించిన స్త్రీలూ ఉన్నారు.

స్త్రీ తనలో ఉండే శక్తిని తాను తెలుసుకోవాలి. తనలో ఉండే శక్తిని వెలికి తీసే ప్రయత్నం చెయాలి. అలాటి శక్తికి మెరుగులు పెట్టే ప్రయత్నాలు చేయాలి. తనకు తానే కించపరచుకొనే మనస్తత్వాన్ని నిరాశావాదాన్ని ముందు మనస్సులోనుండి దూరం చెయ్యాలి. అప్పుడే స్త్రీ సమాజంలో మరింత ఉన్నతంగా పెరగడానికి, సమాజాన్ని మరింత ఉన్నత స్థితికి తీసుకురావడానికి దోహదకారి అవుతుంది.

స్త్రీ ఎంత చదువుకున్నా, ఎంత తెలివైనదైనా సమయానికి తెలివి తేటలు ప్రదర్శించి అపాయమునుండి తప్పించుకొనే తెలివితేటలే కాకుండా ఉపకాకారాన్ని పొందే తెలివితేటలు చాలా అవసరం.

సింహం బారినుండి చిన్నదైన కుందేలు ఎంత తెలివిగా తప్పించు కుందో నీతికథ బోధిస్తోంది. ఆ కుందేలు ఉపాయంతో తాను తప్పించు కోవడమే కాకుండా జంతు కులాన్ని ఆ సింహం బారినుండి తప్పించింది.

మనకి పురాణ కాలంలోని సతీ సావిత్రి పాత్ర చాలా చక్కని పాత్ర. పురాణాల్లోని కథలన్నీ పుక్కిటి పురాణాలు, ఆ కథలు అబద్ధాలు,

వాటిని మేము నమ్మం అని అనేవారెవరైనా ఆమె పాత్రను గురించి ఆలోచించాలి.

ఆమె పాతివ్రత్యం మీద మనకు నమ్మకం లేకపోవచ్చు. ఇది పతివ్రతా విషయం కాదు. ఆమె ప్రదర్శించిన తెలివితేటలకు సంబంధించిన విషయమిది. ఆమెకు యమధర్మరాజు కనిపించాడా? అని ప్రశ్నిస్తే యమధర్మరాజు కాకపోవచ్చు మరొక వ్యక్తి కావచ్చు. నేడు మనం ఎదుర్కొంటున్న ఒక సంఘటన కావచ్చు. ఆ సమయంలో ఆమె ప్రదర్శించిన తెలివితేటలే మనకు అవసరం.

సావిత్రి భర్త మరణానికి కుమిలి కుమిలి ఏడుస్తోంది. పైగా అది అరణ్యం. ఒంటరిగా ఉంది ఆమె. ప్రాణాలు తీసుకొని పోతున్న యమునివెంట ధైర్యంగా నడిచింది, ఆమెను మరలించటానికి ప్రయత్నంగా ఆమెను వరాలు కోరుకోమన్నాడు యముడు. ఆమె కోరిన వరాలు ఇచ్చాడు యముడు. ఆమె తన తెలివితేటలతో యమధర్మరాజునే బోల్తా కొట్టించింది.

"యమధర్మరాజా! పుత్రసంతానం ప్రసాదించు" అంది.

"అదెంతపని ఇచ్చాను తిరిగి పో" అన్నాడు యముడు. ఆమె తెలివితేటలు అన్నీ ఆ వరం కోరడంలోనే ఉన్నాయి. అంతక్రితం ఆమె కోరిన వరాలు అన్నీ ఆమె అత్త మామలకు, తల్లి దండ్రులకు సంబంధించినవి. అన్నీ ఇచ్చినట్లుగానే ఆమె అడిగిన ఈ వరంకూడా ప్రసాదించాడు.

భర్త లేకుండా సంతానప్రాప్తి ఎట్లు యమధర్మరాజా" అని నిలదీసింది యముణ్ణి. తెల్లబోయిన యముడు గుండెలు బాదుకున్నాడు. ఆమె తెలివితేటలకి తలవంచాడు.

పతి ప్రాణాలు తీసుకుని వెనక్కి తిరిగి వచ్చింది సావిత్రి. ఇది సంభవమా? అనే అనుమానానికి తావు లేదిక్కడ! ఆమె తెలివితేటలని ఆమె సమయస్ఫూర్తిని మనం గ్రహించాలి.

-0-

# స్త్రీ సహనం ఎంత వరకు ?

కొంత వరకు మాత్రమేనని సమాధానం చెప్పక తప్పదు. ఓర్పు సహనం ఆమెకు పెట్టని సొమ్ములు నిజమే.

కాని సమాజం ఆ రెండు గుణాలను ఆధారంగా తీసుకొని స్త్రీని నోరులేని దానిగా, అసమర్థురాలిగా జమకట్టి అవమానం చేస్తే స్త్రీ ఎదురు తిరగక తప్పదు లేకపోతే అమె జీవితానికే ముప్పు వాటిల్లుతుంది, ఆమె జాతికే కళంకం ఆపాదించబడుతుంది.

కేవలం కోడలే స్త్రీ కాదు. అత్త, ఆడుబిడ్డ అందరూ స్త్రీలే. కేవలం పురుషులే స్త్రీలని అవమానించడం లేదు. బాధపెట్టడం లేదు. అవకాశం దొరికితే స్త్రీని స్త్రీయే బాధ పెడుతుంది! అవమాన పరుస్తుంది. ఎక్కువ మందిలో కనబడే గుణాలే ఇవి. ఎదుటి వారిని బాధ పెట్టడం సరదా కాబోలు. పడేవారుంటే అనే వారికి అటంకం ఉండదు.

తల్లి కూతురిలో సహనం ఉండిందా అని కొడుక్కి బోధించలేని నీతుల్ని కూతురికి బోధిస్తుంది, అత్తగారు కాలు కదవడానికి బద్ధకించి కోడలిచేత గొడ్డుచాకిరీ చేయిస్తుంది. భార్యకు నోరులేని సహనం ఉందికదా అని భర్త వంట పని ఇందపని, బయటపని అంతా అప్పచెప్పి చివరకు పిల్లల బాధ్యత, ఆర్థిక బాధ్యతా అంతా ఆమెకే అప్పచెప్పి హాయిగా పూలరంగడిలా తిరుగుతూవుంటే ఆ స్త్రీ ఏం చేయాలి? తన ఖర్మ అంతే నని సరిపెట్టుకోవాలా? ఆడదాని జీవితమే అంత అని సరిపెట్టుకోవాలా?

స్త్రీలందరూ ఆలోచించవలసిన విషయమిది :

ప్రేమ ఆదరణ చూపించినంతవరకు స్త్రీ ఎంతటి బాధ్యతనైనా స్వీకరించ కలుగుతుంది. తన ఓర్పుకు. సహనానికి తగిన గౌరవాన్ని స్త్రీ ఆశించడం సహజం. ఆమెను గౌరవించడం సమాజం బాధ్యత కూడా!

కాని అలా కరగనప్పుడు స్త్రీన్ని అవమానించినప్పుడు, తగిన ప్రేమను ఆదరణను, అభిమానాన్ని అందించలేనప్పుడు అమెలో దాగున్న అభిమానం

దెబ్బతింటుంది. సహనానికి బదులు ఆమెలో కక్ష తలెత్తుతుంది. తిరుగు బాటుకు సిద్ధపడుతుంది.

రామాయణంలో సీత పాత్రను సూక్ష్మంగా పరిశీలిస్తే ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. సీత అమాయకురాలు కాదు. ఓర్పు సహనం ఆమెకు ఆభర ణాలు నిజమే. కాని ఒకవిధంగా చూస్తే అందరికంటె పట్టుదల కల స్త్రీ ఆమె. అన్నమాట నెగ్గించుకునే మనస్తత్వం ఆమెలో మనకు కనపడుతుంది

బొమ్మలాటలు ఆడుకునేటప్పుడు అడ్డంగా వుందని శివధనస్సును ఎత్తి పక్కకు పెట్టిన సీత తనకంటె బలవంతుణ్ణి రూపసిని వివాహం చేసుకుంది.

భర్త అరణ్యవాసానికి బయలు దేరుతున్నపుడు, పెద్దలందరూ వద్దం టున్నా వినకుండా శ్రీ రాముని వెంట అరణ్యానికి బయలుదేరింది. రావణాసురుడు లంకలో బంధించినప్పుడు హనుమంతుడు అక్కడకువెళ్ళి తనవెంట రమ్మని అడిగినప్పుడు సీత అందుకు అంగీకరించలేదు.

పైగా "నేను మహావీరుని భార్యను, దొంగతనంగా నీ వెంట పారిపో వలసిన అవసరం నాకు లేదు. శత్రువుల్ని ఓడించి నన్ను బందీగా విడిపించి శ్రీరాముని తీసుకు వెళ్ళమని చెప్పు" అని సమాధాన మిచ్చింది.

శ్రీరాముడు ఆమెను గౌరవించినన్నాళ్ళు అతని మాట వేదవాక్కులా స్వీకరించింది. అగ్నిలో దూకమన్నా దూకింది. కూడా కాని శ్రీరాముడు చాకలి మాటలు విని ఆమెని అరణ్యానికి పంపి వేసి తిరిగి కలుసుకున్నపుడు మరల అగ్నిలో దూకమని అడిగినప్పుడు సీత అతని మాట పాటించలేక పోయింది. అంతటి సహన వతిని రాముని ఆజ్ఞఅవమానంగా భావించింది. నిత్య శంకితుడుగా తలచింది. అతని మాట తిరస్కరించింది. అతని మాటకు ఎదురుతిరిగి అగ్నిలో ప్రవేశించడానికి బదులుగా భూమిని చీల్చుకు వెళ్ళిపోయింది.

భర్త అయినా, అత్తమామలయినా అవమానిస్తే స్త్రీ భరించలేదు. అభిమానం స్త్రీ జాతికి గర్వకారణం. ఓర్పు, సహనం ఆమెకు పెట్టని సొమ్ములు. ప్రేమ అందిస్తే, అభిమానం చూపిస్తే సహనం చూపించగలదు. లేకపోతే పెద్దపులిలా మారగలదు. తన దారి తను చూసుకోగలదు.

అందుకే స్త్రీ సహనం కొంతవరకు చూపిస్తుంది అవమానిస్తే తిరగ బడుతుంది. అప్పుడే ఈ సమాజం మారుతుంది.

# సమయస్ఫూర్తి

సమాజ రథానికి స్త్రీ పురుషు లిద్దరూ రెండు చక్రాలు. సమాజంలో స్త్రీ పురుషు లిద్దరు సరిసమానంగా ఎదిగిననాడే సమాజం మరింత ఉన్నతంగా ఎదుగుతుంది. అందుకే నేటి స్త్రీ పురుషునితో సమానంగా చదువుకుంటుంది. పురుషునితో సమానంగా అంతకంటే ఉన్నతంగా ఉద్యోగం కూడా చేస్తుంది. అయినా స్త్రీ సమస్యలు సమస్యలుగానే మిగిలిపోతున్నాయి. అందరు స్త్రీలకు సమస్యలు ఉన్నాయని కాదు. కొందరు సమస్యల వలయంలో ఉన్నారనడం అబద్ధం కాదు.

కొన్ని సమస్యల్ని తామే పరిష్కరించుకోగల శక్తి స్త్రీలు అలవరచుకోవాలి. సమస్యను అధికం చేసి చెప్పుకోవడవల్ల కాని, చీటికి మాటికి ఏడ్వడం వల్లగాని, తలరాత అలా ఉందని ఉదాసీనం వహించడం వల్లకాని స్త్రీ సమస్యకు పరిష్కారం దొరకదు.

సాధారణంగా వివాహం అయిన తరువాతనే స్త్రీకి ఎదుర్కోవలసిన సమస్యలు ఎదురవుతాయి. పుట్టింటి ఆదరణగాని, అలవాట్లుగాని, ఆప్యాయతగాని, అత్తింట్లో దొరకదు. అత్తగారు తల్లి కానేరదు. కొందరు అత్తలు మంచివారూ ఉండవచ్చు. మంచితనం లేనవారి సగంతే చెప్పుకోవలసి వస్తుంది. అటువంటి అత్తలకు సాయం భర్త కూడా తల్లిమాట విని భార్యను బాధించే పురుషుడైతే ఆ స్త్రీ చాలా ధైర్యంగా ఉండవలసి వస్తుంది. లేనప్పుడు ఆమెను మరింత బాధించటం మొదలు పెడతారు. చెంపే సాహసం అందరిలోనూ ఉండదు. కాని భార్యను బాధించే మనస్తత్వం ఎక్కువ మందిలో కనబడుతోంది.

అందుకే స్త్రీ సమయాన్నిబట్టి. అవసరాన్ని బట్టి, ప్రవర్తించి సమస్యలను పరిష్కరించుకోడానికి ధైర్యం తెచ్చుకోవాలి. తాను అబలనని తక్కువ ధ్యాన్ననే బుద్ధి ఆమె మార్చుకోవాలి. అవసరమైనప్పుడు ఆమె ఎవరికైనా సమాధానం చెప్పడానికి సిద్ధంగా వుండాలి.

ప్రాచీన సాహిత్యంలో నన్నయ చిత్రించిన శకుంతలలో ఈ గుణగాలు మనం కనబడతాయి.

ముని ఆశ్రమంలో తాపసుల మధ్యలో పెరిగింది శకుంతల. శాస్త్రాలను, ధర్మాలను క్షుణ్ణంగా తెలుసుకుంది. కణ్వమహర్షి పుత్రపతి యైన శకుంతలను తాపసులనిచ్చి దుష్యంతుని నగరానికి పంపించాడు. నిండు సభలో కూర్చొని వున్న ఆ రాజును చూసింది శకుంతల. అతని చూపులు విరసంగా కనబడ్డాయి తోడువున్న తాపసులతో ఆ విషయం చెప్పలేదు. తనంతట తానే ఆలోచించుకుంది.

ఎఱుగవొకొ నను నెఱిఁగియు
నెఱుగని యట్లుండు నొక్కయెడ దప్పగుడున్
మఱచె నొకో ముగ్ధలధిపులు
మఱువరె బహు కార్యభారమగ్నులు కారే'

''రాజులు అనేక పనుల భారంలో ఉండటంవల్ల మరచిపోయాడో లేక తెలిసి కూడా తెలియనట్లు నటిస్తున్నాడా'' అనుకుంది. ఆ విషయం రాజుకు జ్ఞాపకం చేయాలనుకుంది. జ్ఞాపకం చేసింది కూడా. కాని రాజు మరచి నట్లే వున్నాడు. అయినా ఆమె ఏడ్వలేదు. భర్త పాదాలమీద పడలేదు. తాపసులను కౌగలించుకొని వెక్కి వెక్కి కన్నీళ్ళు కార్చలేదు. తాపసవర్యు నిల నిండు సభలో నీతిని, ధర్మాన్ని ఉపన్యసించడం మొదలు పెట్టింది. తాను స్త్రీ, పైగా వనవాసం నుంచి వచ్చింది. అది నగరం. మంత్రి సామంతులున్నారు. భర్త అయిన రాజు ఎదురుగా వున్నాడు. అయినా శకుంతల భయపడలేదు. ధైర్యాన్ని విడవలేదు. పట్టరాని కోపం వచ్చింది.

''ఓ రాజా ! సమస్తం తెలిసిన నీవు ఎందుకు తెలియినట్లు నటిస్తున్నావు ? ఈ రహస్యం నీకు తప్ప ఇతరులకు తెలియదని ధర్మాత్ముడవైన నీవు అబద్ధం ఆడవచ్చునా ?'' అంటూ దుష్యంతుణ్ణి నిందీసి అడిగింది. పైగా గుణవతి సంతానవతి అయిన భార్యను అవమానించినవారికి ఇహము, పరము కూడా కలగవు. భార్య లేకుండా ఏ పనీ చేయజాలడు. ఏ సమయంలోనూ భార్యను, ప్రజలను గౌరవించిన రాజుకే కష్టాలు దూరంగా ఉంటాయి అంటూ తెలియచెప్పడమే కాకుండా పుత్రుని ప్రాధాన్యతను వివరించి కనీసం పుత్రుని స్వీకరించమని తెలియచెప్పింది. తిరిగి దుష్యంతుడు తనకు ఏదీ తెలియదని నిండు సభలో అబద్ధమాడాడు. శకుంతలకు పట్టరాని దుఃఖం వచ్చింది. మనసు ఆవేదనతో నిండిపోయింది. అయినా ధైర్యంగానే వుంది. అయినా ధైర్యంగానే వుంది. "నాథా ! అంటూ భర్త

పాదాలమీద పడి భోరున ఏడ్వలేదు. తనతో ఉన్న తాపసులతో తన కష్టం చెప్పుకొని కౌగలించుకొని బాధ పడలేదు. కుమారుని తీసుకుని అక్కడ నుంచి వెళ్ళిపోవడానికి సిద్ధపడ ది.

సమయానికి ఇటువంటి ధైర్యాన్ని ప్రకటించే శక్తి స్త్రీ అలవాటు చేసుకోవాలి. తాను చదువుకున్న విజ్ఞానాన్ని సమయానికి వినియోగించు కొనే శక్తి ఆమెకు కలగాలి. అలా కలిగినప్పుడే అడది ఆటబొమ్మ అనుకునే అభిప్రాయం మారిపోతుంది. అడది శారీరకంగా పురుషునికంటే నీరసురాలు కావచ్చు అంతమాత్రంచేత ఆమె తక్కువదని, పురుషుడన అధికారం చేసేవాడని అభిప్రాయాలు సమాజంలో మారవలసి వుంది. మారుతున్నాయి కూడా. కొందరు స్త్రీలు అమాయకత్వం వల్లనే చీటికి మాటికి భర్తచేత చివాట్లు తినడం, అత్తచేత సాధింపులు పడటం జరుగు తోంది. స్త్రీ ధైర్యస్తురాలు అయినప్పుడు భర్తకు అర్ధాంగిగా, గృహిణిగా ఆతనికి తగిన సలహాలు ఇచ్చేదిగా నిలబడుతుంది కాని ఆతనిచే ఛీత్కరించు కొనే స్థితిలో ఉండదు.

అందుకే ఈ ఔన్నత్యాన్ని సమాజంలో స్త్రీ సంపాదించాలంటే తన స్థితిని తానుగురించి, తన బాధ్యతను, తన ప్రాధాన్యతను తాను గుర్తించు కొని ధైర్యంగా సమస్యల్ని ఎదుర్కొనవలసి ఉంటుంది. అప్పుడే ఆమె ఉన్నతురాలిగా గుర్తింపబడుతుంది. కొన్ని స్త్రీ సమస్యలకు పరిష్కారం అప్పుడే లభిస్తుంది. ప్రభుత్వం చట్టాలు తేగలదు కాని ఆచరణ చూపించ లేదు. సమస్యకు పరిష్కారం ఆచరణ వల్లనే దొరుకుతుంది. అది ఆచ రించవలసింది స్త్రీ మాత్రమే. అందుకే స్త్రీ మరింత ధైర్యవంతురాలు కావాలి. మరింత వున్నతురాలుగా పెరగాలి.

# ఆడవాళ్ళు - ఆత్మహత్యలు

స్త్రీల ఆత్మహత్యల సంఖ్య రోజు రోజుకి పెరుగుతోంది. అందులో పెళ్ళి అయిన స్త్రీల ఆత్మహత్యలు మరీ ఎక్కువని చెప్పాలి. వీటికి ఘోరాతి ఘోరమైన మన సాంఘిక దురాచారాలే కారణంగా కనబడుతున్నాయి.

సాధారణంగా పెళ్ళికాని ఆడపిల్లల ఆత్మహత్యలు ప్రేమించిన వానితో పెళ్ళికాలేదనో ఇష్టంలేని వానితో పెళ్ళి చేస్తున్నారనో, లేక ప్రేమించిన వ్యక్తి మోసం చేసి వెళ్ళిపోయాడనో జరుగుతూ వుంటాయి. ఒక్కొక్కప్పుడు సవతి తల్లి బాధలు పెట్టిందని కూడా మరణించడం జరుగుతూ వుంటుంది. ఈ ఆత్మహత్యలు చాలా తక్కువనే చెప్పాలి.

అత్తవారింట్లో కాపురం చేసుకునే స్త్రీల ఆత్మహత్యలు రోజురోజుకి పెరుగుతున్నాయి. అందులో చదువుకోక, సంపాదనలేక, తల్లిదండ్రులకు పోషించే శక్తిలేనప్పుడు, లేక నా అన్న పుట్టింటి వారెవ్వరూ లేనప్పుడు, స్త్రీ అత్తవారు, భర్తపెట్టే బాధలు సహించలేక మరణించడం మిక్కిలి బాధను కలిగిస్తుంది. చదువుండి, సంపాదన వుండి ఆస్తి పరులైన తల్లిదండ్రులు బ్రతికి వుండగా స్త్రీ ఆత్మహత్యకు పాల్పడటం ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది.

ఈ ఆత్మహత్యలకు సాధరణంగా వరకట్నం ప్రధాన పాత్రను వహిస్తోంది. కట్నం పూర్తిగా తేలేదనో, లేక కావలసిన లాంఛనాలు ముట్టచెప్పలేదనో అత్తవారు, భర్త నానాబాధలు పెట్టి ఆమె ఆత్మహత్యకు కారణభూతులవుతున్నారు.

ఈ కట్నమే కాకుండా అత్త, ఆడబిడ్డలు తమ ఆధిపత్యాన్ని చూపించడంకోసం కోడళ్ళను నానా బాధలు పెట్టడం, కట్టుకున్న భర్తగారు తందానతాన అనడం మరొక రకంగా ఆమె చనిపోవడానికి కారణమవుతున్నారు.

మరి దురలవాట్లున్న భర్తలు భార్యను హింసించడం ఎలేతవరకు అంటె ఆమె ఆత్మహత్య చేసుకొనేంత వరకు దోహదం చేస్తోంది. ఏదుర్గ

జాలులేక పోయినా కొందరు మగవారు (భర్తలు) భార్యను నలుగురిలో తిట్టడం, కొట్టడం చాలా సునాయాసంగా చేస్తూంటారు. అలా భార్యను బాధించడం సమాజం తనకిచ్చేన పురుషాధిక్యత అనుకుంటారు.

మొదటినుంచి సమాజంలో పురుషుణ్ణి స్త్రీకంటె అధికుడని చెప్పడం వల్ల (మగవారే చెప్పుకున్నారులెండి) తమ అధిక్యాన్ని ఆ విధంగా ప్రదర్శించాలనుకునే మగవాళ్ళు పాపం ఇంకా ఎంతోమంది నేటికీ మిగిలిపోయారు. జారావా ? ఇలా వందమందితో గడిపి, బజారు కుక్కలా బ్రతికేకంటే— నాకు వుంపుడుగత్తెగా వుండివుంటే జాతికుక్కలా బ్రతికే దానివిగా !!''

అంతే!!!

నేనిప్పుడు యంత్రాన్ని కాదు—

జీవం వచ్చింది—

చలనం కలిగింది—

చలనం-ప్రచండ ప్రభంజనం లాంటి చలనం—

నాకే ఆశ్చర్యమనిపించే చలనం—

ఈ లోకమే ఆశ్చర్యపోయే చలనం-

రెండు చేతులూ మంచానికి నొక్కిపట్టి శరీరాన్ని బంతిలా పైకిలేపి, వళ్ళువిరిగించి, శక్తికొద్దీ రెండు కాళ్ళనీ ముందుకు విసిరాను.

''అమ్మా!!''

రెండు చేతులూ పొత్తికడుపు క్రింద నొక్కిపట్టి, మెలకలు తిరుగుతూ,... మొదలునరికిన చెట్టులా వెనక్కి విరుచుకుపడి,... బేలగా చూస్తూ నావైపు కట్టెలా బిగుసుకుపోయాడు జీవంలేని జీవి...

ఎవరో ''మర్డర్'' అని అరుస్తూ, ఇటూ అటూ పరుగులు పెడుతున్నారు-

ఆ తర్వాత నాకేమయిందో అనవసరం—

ఈ జగన్నాటకంలో నా పాత్ర పూర్తయ్యింది.

అంతే!!!

కాగితాలు యథాలాపంగా మడిచి, కుర్చీలో భారంగా వెనక్కి వాలాను. గుండెకు గుడిబండ దిగేసినట్లుగా వుంది. కళ్ళజోడు నుదిటి మీదకుతోసి, కనుకొలకుల్లో వూరిన తడిని రెండు వ్రేళ్ళు గుచ్చి అద్దుకుంటూ,— 'అర్నెల్ల క్రితం'— మనసు పాడయి, వ్యభిచార గృహానికి వెళ్ళిన వైద్య విద్యార్థిని, అతని వద్ద వున్న కొద్ది ధనం కోసం విచిత్ర పద్ధతిలో హత్య చేసిన వ్యభిచారిణి: అంటూ పేపర్లలో వచ్చిన వార్తల్ని నేనూ చదువుతూండే వాడిని. అందరితోబాటే నేనూ నువ్వొక వ్యభిచారిణివి, హంతకురాలివనే అనుకున్నాను. నీ తరఫున కోర్టులో ఎవ్వరూ వాదించడానికి ఒప్పుకోలేదు నవ్వు. నీకు యావజ్జీవ కారాగార శిక్ష పడినందుకు సంతోషించినవారిలో నేనూ ఒకణ్ణి. కాని నీ వెనక ఇంత విషాదం వుందనీ నేనెరుగను చెల్లీ' నేనే కాదు ఎవ్వరూ ఎరుగిరు. నీవాళ్ళకు నిజం తెలిస్తే చాలని నువ్వు వ్రాసుకున్న కథ యిది. అయితే- నా శక్తి కొద్దీ నాకు వీలయినంత మందికి ఈ సత్యాన్ని చాటుతాను. నిజానికి- అవకాశమే వుంటే- చంద్రుడంత ఎత్తున నిల్చుని గొంతెత్తి బిగ్గరగా నీ కథ లోకానికి చదివి వినిపించాలనుంది కస్తూరీ అనుకుంటూండగా, రెండు కన్నీటిబొట్లు నా వ్రేళ్ళను తప్పించుకొని, చెంపల మీదకు జ ర్రున జారాయి.

వీటికి సాయం ఆ మహానుభావునికి అనుమానం ఒకటి. భార్య ఏ పురుషుని కంటపడ్డా, ఎ పురుషునితో మాట్లాడినా, ఎ పురుషుడు ఆమె కేసి చూసినా ఆమెదేతప్పు. ఇంటికెళ్ళి గదిలో పెట్టి నానా దుర్భాషలతో చావకొట్టడం, దానికి తల్లి, తమ్ముళ్లు, చెల్లెళ్ళు దగ్గర బంధువులు దోహదం చెయ్యడం. ఇంతకంటె రాక్షసకృత్యం, వీరి కంటె రాక్షసులు ఈ కలియుగంలో మరెవ్వరూ లేరనే చెప్పాలి. ఇంకా కోపం పట్టలేక ఆ పిల్లకు తగిన తిండికూడా యివ్వక పోవడం, ఖైదీలకంటె కఠిన వీరు ఇళ్ళలో నే ఆమలు పరుస్తున్నారు.

ఆ శిక్షలు విచారించడాని న్యాయస్థానాలుఇంకా మన దేశంలో రాలేదు, అందుకే గత్యంతరం లేక ఆత్మహత్యకు పూనుకుంటుంది స్త్రీ. అందులో రకాలు. అంటించుకోడం, విషం మింగడం, నీళ్ళలో మునగడం ఉరెట్టుకోడం, ఆ పిల్లకు ఏది అందుబాటులో వుంటే అది.

ఒక్కొక్కప్పుడు ఆ పిల్లకు ఆత్మహత్యకు సిద్ధపడే తెలివి, ఆలోచనా లేకపోతే ఆ పని కాస్త అత్తవారే పూర్తి చేసి ఆత్మహత్యని పేరు పెట్టే

స్తారు. సమాజానికి సంబంధన లేనప్పుడు; న్యాయం ధర్మాల గుడ్డిదైనప్పుడు అన్యాయం రొమ్ములు విరుచుకు సాగడం సహజం. బలమైన చేపలు బల హీనమైన చేపల్ని పట్టి మింగడం సహజమని చూస్తుంటే అరాచకాలు మితి మీరుతూనే వుంటాయి.

పైగా పెళ్లి చేసుకొనేటప్పుడు వరకట్నం మొక్కటేనా కోరిక ? అమ్మాయి అందంగా వుండాలి. చదువుకోవాలి. సంపాదించి భర్త చేతిలో పొయ్యాలి. ఇంటెడు చాకిరి చెయ్యాలి. నోరెత్తి మాటడకూడదు. అప్పనంగా దొరుకుతూవుంటె ఎవరైనా కోరతారు. దీనికి కారణం కన్నతల్లి తండ్రులు పెండ్లికాగానే తమ బాధ్యత తీరిందనుకోడం, ఒకవేళ కూతుర్ని అల్లుడు వదిలేశాంని తెలిస్తే లోకం ఏమైనా అంటుందని భయం కూతురు నానా బాధలు పడుతున్నా, చివరికి వాటి చేతుల్లో చచ్చిపోయినా లోకం మాత్రం వారిని ఎమీ అనకూడదు. కూతురొచ్చి పుట్టింట్లో వుంటే అదనంగా ఖర్చుని కూడా ఆ పుట్టింటి వారు కలుగజేసుకోరు. ఇక సమాజం సంగతి సరేసరి. చెప్పుకోడానికి ఏదైనా కొత్త విషయం దొరికితే చాలనుకుంటారు. తప్ప ఆ అత్తను: భర్తను నుంచో పెట్టి అడిగె నాధులేలేరు.

ఇటువంటి సమాజంలో పెరుగుతున్న స్త్రీ చదువుకున్నా సంపాదనా పరురాలైనా తగిన చేయూత లేక సుడిగుండంలో పడ్డ గడ్డిపరకలా వుంది తప్ప మానసికంగా ఎదగలేకపోతోంది. ఆ చదువూ, సంపాదనా లేని స్త్రీల సంగతి చెప్పనేవేను. భర్త చేతితో చావుదెబ్బలు తింటూ, అత్త నోటితో నానా చివాట్లు తింటూ జీవచ్ఛవంలా బ్రతికే అనాధులు ఎందరో వున్నారు ఇంకా.

మొదటినుంచి స్త్రీ సమాజంలో ఎదో విధంగా నలిగిపోతూనేవుంది. రాజారామమోహన్‌రాయ్ వంటి వారు సతీసహగమన దురాచారాన్ని నిర్మూలించ ప్రయత్నించారు. క్రమంగా అంతరించి ఫలితాన్ని పొందింది. స్త్రీని తలనిండ నుదుటి కుంకుమతో కలకలలాడుతూ చూడాలనుకునే వీరేశలింగం పంతులు గారు బాల్యవివాహాలను రద్దు చేయించి విధవా వివాహాలను ప్రోత్సహించాను. అది కూడా ఫలించి ఆ దురాచార శిక్షనుండి విముక్తురాలైంది.

మన ఆధునికాంధ్ర సాహిత్యానికి యుగకర్తలైన స్వర్గీయ గురజాడ వారి 'పూర్ణమ్మ కథ' రాయప్రోలు 'స్నేహలత లేఖ' ఈ ఆత్మహత్యలకు సంబంధించినవే. గుండెలను సముద్రాలుగా మార్చే విషాదగాథలివి. గురజాడవారి పూర్ణమ్మ కన్యాశుల్కానికి బలియైపోయిన ఒకముద్దుబాల కరుణామయ గాథ. ఆ రోజుల్లో ధనవంతులైన ముసలి డాగవారు ధనాన్ని ఎరగా చూపించి ముక్కుపచ్చలారని ముద్దుగుమ్మలను వివాహమాడటానికి సిద్ధపడేవారు. సుమారు తొంభై ఎళ్ళు వచ్చినా ఒదవ వివాహమైనాసరే పెళ్లి చేసుకోడానికి సిద్ధపడేవారు. ధనాశావరుడైన ఆ తండ్రి ధనం పుచ్చుకుని పెద్దమనిషికూడా కాని ఆ పిల్లను ఆతనికిచ్చి పెళ్ళిచేసేవాడు. ఆ వివాహం జరిగిన పూర్ణమ్మ తన కన్యత్వాన్ని నిలువుకోడానికి ఆత్మహత్య చేసుకుంటుంది. ఆనాటి ఆ సాంఘిక దురాచారం కూడా నసిసి పోయిందనే చెప్పాలి. ఆ విధంగాకన్యలు రక్షించబడ్డారు.

రాయప్రోలు వారు 'స్నేహలత లేఖ' లో ఉన్న ఒక్క ఇంటినిఅమ్మి తండ్రి తన పెళ్ళి నిశ్చయించటం చూడలేక మరణిస్తూ రాసిన లేఖను వర్ణించారు. కవి స్నేహలత ఎందుగనిన స్వార్థమే జ్వలింలిఈయుగ కాలమందున హేయమైన కన్యకా వరశుల్క రాక్షస కళంకమును ఇసీయని రోయడే యనుజుడొకడు అంటూ తెలియపిరచింది. ఈనాటికీ వీడని రాక్షస దురాచారమిది. స్త్రీని పురుషుడు పురుషుల్ని స్త్రీలు నిందింనుకునే సమయం కాదు ఇది. అందరూ ఏకమై దురాచారాలను నిర్మూలించడానికి తగిన ప్రయత్నం చేయాలి. యువతీ యువకులంతా పరకట్న నిషేధానికి కంకణం కట్టుకోవాలి. బాధలు పెట్టే అత్తవారిచేతులకు సంకెళ్ళ వేయించాలి. బలి కాకుండా స్త్రీలకు చైతన్యాన్ని తగిన అకడ చూపించాని. అంతవరకు అవిరామంగా కృషిచేయాలి.

# తానా శ్రమపడనిదే కుటుంబం గడవని

## నేటి మహిళ

నేటి స్త్రీ విద్యావతి; స్వేచ్ఛాజీవిని అనే చెప్పాలి. పెద్ద పెద్ద చదువులు చదవకపోయినా కావలసినంతగా చదువుకుని సంసారాలను చక్కదిద్దుకుంటున్నదనే చెప్పాలి. ఎన్నో విషయాలను తెలుసుకుని తన పనులను తానే చేసుకుంటున్నది, అంటే మునుపటికంటె ఎన్నో రెట్లు స్వేచ్ఛను కలిగి ఉన్నది. ముందుతరం వరకు స్కూలుకు వెళ్ళి చదువుకుంటేనే తప్పన్న పెద్దలే మారి తమ నియమాలను తామే సడలించుకొని యువతరానికి ఉత్సాహాన్ని, చేయూతని ఇస్తున్నారు.

నేటి స్త్రీలు ఇంటిపనులు తమంతట తామే చేసుకుంటూ, సరకులు కొనుక్కోవడం, కూరలు తెచ్చుకోడం, పిల్లల చదువుల విషయం మొదలయిన బాధ్యతలను నిర్వహించే శక్తి కలిగి ఉన్నారు. మొన్నటి వరకు పురుషుడే భరిస్తున్న ఆర్థిక విషయాలలో కూడా నేటి స్త్రీ తగిన పరిజ్ఞానాన్ని కలిగి ఉంది. ఉద్యోగంలో ఉన్న స్త్రీ అయితే సంసార భారాన్ని కూడా తానే భరిస్తోందని చెప్పాలి. ఈ విధంగా చూస్తే స్త్రీలో ఉన్న ఉత్సాహం, తెలివి, పట్టుదల ప్రకాశించే తరుణం ఆసన్నమైనదనే చెప్పాలి. తన తెలివిని ఉపయోగించుకొని తానే తన జీవితమార్గాన్ని నిర్ణయించుకొని భవిష్యత్తుకు పూలబాటలు వేసుకొంటున్నది.

కాని, నేటి స్త్రీలందరూ ఇలాగే ఉన్నారా? అంటే ఉన్నారని చెప్పటానికి వీలు లేదు. ఎంతో మంది వెనుకబడినవారు ఉన్నారు. వెనుకబడి ఉన్నా మునుపటి కంటె ఎన్నో రెట్లు విషయ పరిజ్ఞానాన్ని స్వేచ్ఛను కలిగి ఉన్నారు. కాని కొన్ని కుటుంబాలు ఆచారవ్యవహారాలతో విద్యా జ్ఞానాలలో వెనుకబడి వుండడంచే ఆ కుటుంబ స్త్రీలు కూడా కొంతవరకు అలాగే ఉంటున్నారు. కాని కాలం ఇంతగా మారినప్పుడు వారు కూడా సుఖపడే తరుణం తప్పక వస్తుంది.

## స్త్రీలు – చదువు

నేడు చాలామంది స్త్రీలు విద్యావంతులనే చెప్పాలి. ఆర్థికంగా వెనుక బడి ఉన్నా ఏదో విధంగా కష్టపడి చదువుకుంటున్నారు. స్త్రీకి కేవలం చదువే వుండాలా? చదువు ఎందుకు? ఉద్యోగాలు చేయ్యాలా ? ఊళ్ళేలాలా ? అనే సిద్ధాంత వాదులు కూడా నేడు ఉన్నారు. స్త్రీకి చదువు కేవలం ఉద్యోగం కోసం కాదేమో: మానవ సహజమైనది ప్రతిభ. ఆ ప్రతిభ విద్యతో వికసిస్తుంది. వారిలో ఉండేజ్ఞానాన్ని అధికం చేసిమూర్ఖత్వాన్ని పారద్రోలుతుంది. అప్పుడే చదువుకున్నందుకు ఉపయోగం కనబడుతుంది. ఒకప్పుడు ఉద్యోగ చెయ్యటానికి కూడా యీ చదువు ఉపయోగిస్తుంది. మొన్న మాకు మాకు తెలుసున్న ఒకాయన హఠాత్తుగా పోయారు. అంతవరకు చదువుకున్నవావారిని ఆక్షేపణ చేసే ఆయన భార్య ఉద్యోగం చేస్తే కాని ఇల్లు గడవని పరిస్థితి ఏర్పడింది అప్పుడు మెట్రిక్ కట్టించి టైపు నేర్పించి ఆదే అదే ఆఫీసులో ఉద్యోగంలో చేర్పించారు.

చదువు వల్ల స్త్రీకి ఎన్నో విషయాలు తెలుస్తాయి. స్త్రీకి సహజంగా ఆలోచించే శక్తికలుగుతుంది. అంతే కాక పలు చోట్ల తిరిగి నాలుగూ గ్రహించి అనుభవాన్ని పెంపొందించుకొని ఎన్నో నూతన విషయాలను తెలుసుకో వీలవుతుంది. లేంట్లోని వ్యక్తులు పక్కదారిపట్టినప్పుడు వాళ్ళకు నచ్చచెప్పి లేక అదిరించి వాళ్ళను నన్మార్గానికి త్రిప్పగలుగుతారు. కాని నేటికిని కొంత మంది పురుషులు చదువుకున్న స్త్రీలు అహంతరులని పెళ్ళి చేసుకుంటే కష్టం అని అపోహలో ఉన్నారు. కాని అది నిజం కాదు. స్త్రీలు, పురుషులు కూడా చదువుకున్నప్పుడు ఒకరినొకరు అర్థం చేసుకొనే విశాలహృదయం శక్తి వారిలో ఎర్పంతాయి. భర్త అంటే లొంగిఉండా అన్న అభిప్రాయం గల పురుషుల మనస్తత్వాలు, చదువుకున్నాము కదా మగవారికి ఎందుకు గౌరవించాలి. అన్న స్త్రీల మనస్తత్వాలను చదువుతే చక్కదిద్దాలి. చదువుకోనివారు ఎంతోమంది చదుకున్న వారి కంటె నంస్కారవంతులుగాను మహా జ్ఞానిసులుగాను కనబడుతున్నారు. అటువంటి వారికిచదువుకూడా ఉంటే బంగారానికి పరిమళమబ్బి నట్లవుతుందేమో:

అయితే స్త్రీలు ఎంతవరకు చదవాలి? అన్నది ఒక ప్రశ్న. నిత్య జీవితంలో ఉపయోగించే చదువులు స్త్రీకి చాలేమొ అది వారి మనస్తత్వం మీన ఆధారపడి ఉంటుంది. తనలో అజ్ఞాతంగా ఉన్న శక్తులను స్త్రీ వెలికి తీసి సద్వినియోగం చెయ్యడంలో తప్పులేదేమో!!

## స్త్రీలు - చదువు

మధ్య తరగతి కుటుంబాల్లో ఇంకా స్త్రీ విద్య మీద సరియైన అవగాహన లేదనే చెప్పాలి. ఆడపిల్లకి చదువెందుకనే అభిప్రాయం స్త్రీలలోను, పురుషులలోను ఉంది. పల్లెల్లోనే కాదు పట్నాల్లో కూడా అయిదో తరగతి వరకు చదువుకొని ఆడపిల్లలు నేటికీ ఎంతో మంది వున్నారు. బాగా చదువుకుంటె పెద్దలమాట వినరని అభిప్రాయం చదువుకుని బయట తిరిగితే ఇంటి గౌరవం పోతుందని అభిప్రాయం. ఎక్కువ చదువుకుంటే ఆడపిల్లకి పెళ్ళి అవడం కష్టమని అభిప్రాయం ఇంకా చాలామంది పెద్దల్లో ఉంది. అందువలననే స్త్రీవిద్య వెనక బడుతోంది. చదువుకోవాలనివున్నా ఆడపిల్లలు చదువుకోలేక పోతున్నారు. వారి ఉత్సాహం నీరు కారిపోతోంది. పెళ్ళి వివాహమై అత్తవారింటికి వెళ్ళిన తరువాత భర్త జీతం చాలక తాము ఉద్యోగం చేసి సంపాదించలేక ఎందరో మంది ఆడపిల్లలు నానా ఇబ్బందుల పాలవుతున్నారు. అప్పుడు చదువుకుని ఉద్యోగాలు చేసి సంసారాలను ఆదుకునే స్త్రీలు కూడా ఎందరోమంది కనబడుతున్నారు.

చదువు డిగ్రీలకోసమే కాదు. చదువు విజ్ఞానం అందిస్తుంది. సంపాదన కలిగిస్తుంది. కీర్తిని అందిస్తుంది. చదువుకున్న ఆడపిల్లలు అటు కుటుంబానికి, ఇటు సమాజానికి ఎన్నో విధాల సహకరిస్తారనే విషయం అందరూ గ్రహించాలి. ఆడపిల్లలు చదువుకుంటే పెద్దల్ని ఎదిరిస్తారని, ఉద్యోగం చేస్తే భర్తమాట వినరని కొందరు ఇంకా భావించడం విచారకరం.

స్త్రీకాని, పురుషుడుకాని విద్యారంగంలో ఒక్కటే. చదువుకోడానికి లింగ భేదాలు అడ్డురాకూడదు. కుటుంబంలో పురుషునితో పాటు స్త్రీకూడా చదువుకోడం చాలా అవసరం. ఎంతవరకు చదువుకుని విజ్ఞానం సంపాదించాలనుకున్నా, డిగ్రీలు సంపాదించాలనుకున్నా అడ్డురావడం అపచారమే అవుతుంది. చదువు జీవితాంతం వెంట వచ్చే సంపద. పదిమందికి పంచిపెట్టవలసిన సంపద ఎంతపంచినా తరగని సంపద. దినదినము వెలిగే సంపద.

చదువుకోడంవల్ల నేడు స్త్రీ కుటుంబాలను ఆర్థికంగా ఆదుకోడమే కాకుండా తనంతట తాను నిలబడే శక్తిని సంపాదిస్తోంది. జీవితంలో ఏ ఆపదలు వచ్చిన కష్టాలపాలు కాకుండా ధైర్యంగా నిలబెట్ట కలిగింది స్త్రీకి సంపాదన. అందుకే నేడు స్త్రీకి సంపాదన చాలా అవసరం. పిల్లల భవిష్యత్తుకి, కుటుంబ భవిష్యత్తుకు మూలస్తంభం స్త్రీవిద్య. సమాజ శ్రేయస్సుకు, దేశ ప్రగతికి పునాది స్త్రీవిద్య. స్త్రీ సంపాదన స్త్రీలు చదువుకోవాలి. నాగరికతను, విజ్ఞానాన్ని, మరింత పెంచుకోవాలి. పదిమందికి దాన్ని పంచి పెట్టాలి. అదే నేటి స్త్రీ బాధ్యత.



# చైతన్య ప్రవంతి

by

డా॥ వాసా ప్రభావతి

ఇతర రచనలు

1. ఆలాపన (కవితాసంపుటి)
2. అమ్మ (కవితా సంపుటి)
3. జగతి ప్రగతి (కవితాకావ్యం)
4. మానవశిఖరం (కవితాసంపుటి)
5. కాటుకంటి నీరు (కవితా కావ్యం)
6. న్యాయం గుడ్డిది (కథలసంపుటి)
7. సంఘం చేసిన భిక్షకి (నాటిక)
8. పరివర్తన నాలుగు ఏకాంకికలు
9. కళాతపస్వి రాపూరు వెంకట సత్యనారాయణ జీవిత చరిత్ర
10. రష్యాలో స్నేహయాత్ర
11. స్నేహసుమాలు (కవితాసంకలనం)
12. రాగమాలిక (లలితగేయాలు)
13. ఆంధ్ర సాహిత్యములో హరిశ్చంద్రోపాఖ్యానము
    పి.హెచ్.డి. సిద్ధాంత గ్రంథం'